# మ న వి

మంగళారతులంటె నాకు చాలశ్రద్ధ. చిన్ననాటినుండి నేను వెదకి వెదకి కొన్ని మంగళారతులు కంఠస్థము చేసికొంటిని. వానినెల్ల నొక పుస్తకరూపమున ప్రకటించుటకు నా మిత్రులెల్లరు నన్ను ప్రోత్సహించినందున నేనీ పుస్తకమును ప్రకటించితిని. వీటిని స్త్రీ, పురుషులు, బాల బాలిక లెల్లరు పఠించి నా సేవను సార్థక మొనర్తురని ఆశించు చున్నాను.

బొ ం బా యి
21-10-1940

మీ విధేయుడు
వంగ గోవిందు నరసయ్య

## (శీలం - పరమ భూషణం)

శీలమనగ సదాచారము లేక సత్ప్రవర్తనము. ఆ సత్ప్రవర్తనము స్నాన సంధ్యానుష్టానములు, గాయత్రి మహామంత్ర జపము, ప్రాణయామ సాధనము, ఈశ్వరోపాసన, సాధుసజ్జనసేవ, సత్సహవాసము, సత్యాహింసలు మొదలగు వానివలన గలుగును. ఆ శీల ప్రవర్తనము వలన నొకవిధమైన తేజస్సు అనగా ఆత్మబలము గలుగుచున్నది. ఆ యాత్మబలముచే యెట్టిదుర్ఘరకార్యమైనను అవ లీలగా జేయగలుగుదురు, ఆ శీలశక్తివలన గాంభీరౌదార్యా, శౌర్య, శాంత, శమ, దమాది సద్గుణములున్ను ఇంద్రియ నిగ్రహమున్ను మనకలవడును. శీలబలమునకు శారీరక మానసికబలము లెంత మాత్రము యీడు గానేరవు. శీలమగు శక్తిచే సాధించరాని కార్యముండదు. మృత్యువును గూడా జయించ గలము.

(ఆ శీలశక్తిచే మృత్యువునుగూడా జయింపగలము. ఈ శీలమను) మహాశక్తిని సాధించియే మొదట మనవంటి వారలుగానుండిన యింద్రాది దేవతలు, సప్తర్షులు మొదలైన మహాపురుషులు నక్షత్ర మండలమున ప్రకాశించుచున్నారు. ఆ శీల బలముననేషోడశమహా రాజులు, షట్చక్రవర్తులు, మహా పతివ్రతలు యెంతటి మహాకార్య ములనైన చేసిరి. కాన సోదర సోదరీ మణులారా! మనముగూడ సదాచార సంపన్నులమై శీలమును సంపాదించి యిహమందు కీర్తి, పరమందు ముక్తిని పొందుదుముగాక.

ఇది,
మహాత్ముల ఉపదేశము

## ఐదవ కూర్పు

ఆర్యులారా! ఇదివరలో ఈ గ్రంథము నాలుగు తడవలు ముద్రింపించితిని. కాని ఆయా కూర్పులలో అచ్చటచ్చట కొన్ని తప్పులు పడియున్నందున సాధ్యమైనంతవరకు ఈ కూర్పులో సవరింపించి మరికొన్ని నూతన మంగళారతులు కీర్తనలు చేర్చి ముద్రింపించు యవకాశము చిక్కినందుల కెంతయో సంతసించు చున్నాను. మరేమైన దోషము లున్నచో అనతికాలములోనె ఆరవకూర్పు చేయించవల్సియుంది. అపుడు సరిచేసి మీసేవలో ప్రవేశ పరచగలనని మనవి చేయుచున్నాను.

ఇట్లు,

నిజామాబాదు
తే 1-9-196

వంగ గోవిందు, నరసయ్య

# గమనిక

మావద్ద భక్తి విజ్ఞాన, వైరాగ్య, నీతి, ఆచార, ధర్మాది, ఆరోగ్య మార్గదర్శకముల బోధించు పుస్తకములు, శ్రీ మహాఋషి, మలయాళస్వాములవారివి, శ్రీ రామకృష్ణ మఠము, శ్రీ రామ తీర్థ సేవాశ్రమము, శ్రీ అరవిందాశ్రమము, శ్రీ వావిలికొలను సుబ్బారావు, శ్రీ చైతన్య గ్రంథమండలి, ప్రకృతి కార్యాలయము ట్రస్టు, దివ్యజ్ఞాన సమాజము, ఆర్య సమాజము మొదలగు వారల గ్రంథములు, మరియు దేశనాయకుల చరిత్రలు నవలలు, నాటకములు, కథలు, కావ్యములు, వైద్య జ్యోతిష్య గ్రంథములు, శతకములు, కీర్తనలు, హరికథలు. పురాణేతిహాసములు, చమత్కార శృంగార, వేదాంత గ్రంథములు మరియు పాఠశాలలకు సంబంధించిన అన్ని రకముల పుస్తకములు దొరకును.

## వంగ గోవిందు, నరసయ్య

పుస్తకముల వ్యాపారము

**286 B. ఫర్గ్యూసన్ రోడ్, బొంబాయి 13.**

**మరియు : ఆదర్శ పుస్తకాలయము, స్టేషన్ రోడ్. నిజామాబాద్.**

ఈ దిగువ వారివద్ద ఈ గ్రంథములు లభించును.

# వి ష య సూ చి క

## మంగళహారతులు

కీర్తనలు



---

# మంగళహారతులు

---

## దైవప్రార్థన

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్.

జనగణమన అధినాయక జయహే భారత భాగ్యవిధాతా।
పంజాబసింధ్ గుజరాతమరాతా ద్రావిడ ఉత్కళవంగా
వింధ్యహిమాచల యమునాగంగా ఉచ్ఛల జలధి తరంగా
తవశుభనామే జాగే – తవశుభ ఆశిషమాగే –
గాహే తవజయగాథా
జనగణ మంగళదాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే, జయహే, జయహే జయజయజయజయహే ॥1॥
అహరహతవ ఆహ్వానప్రచారిత శునితవ ఉదారవాణీ
హిందుబౌద్ధ సిఖ జైన పారసిక ముసల్మాన్ క్రిస్తానీ
పూరవ పశ్చిమఆసే – తవసింహాసన పాసే –
ప్రేమహారహాయగాథా
జనగణఐక్య విధాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే, జయహే, జయహే, జయజయజయజయహే ॥2॥

పతన అభ్యుదయ బంధురపంథా యుగయుగ దావితయాత్రీ
తుమిచిరసారథి తవరథచక్రే ముఖరిత పథదినరాత్రీ
దారుణవిప్లవమాఝే । తవశంఖధ్వనివాజే - సంకటదుఃఖత్రాతా
జనగణ పథపరిచాయకజయహే భారతభాగ్యవిధాతా
జయహే, జయహే, జయహే జయజయజయ జయహే ॥3॥
ఘోరతిమరఘన నిబిడనిశీధే పీడిత మూర్ఛితదేశే
జాగ్రత చిలతవ అవిచల మంగళ నతనయ నే అనిమేషే
దుస్వప్నే ఆతంకే - రక్షా కరిలే అంకే-
స్నేహమయీ తుమిమాతా
జనగణ దుఃఖత్రాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే, జయహే, జయహే జయజయజయ జయహే ॥4॥
రాత్రిప్రభాతిల ఉదిరవిఛవి పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహంగమ పుణ్యసమీరణ నవజీవనరసఢాలే
తవకరుణారుణరాగే - నిద్రిత భారతజాగే -
తవచరణే నతమాథా
జయజయజయహే జయరాజేశ్వర భారతభాగ్య విధాతా
జయహే, జయహే, జయహే జయజయజయ జయహే ॥5॥
(రవీంద్రనాథ్ ఠాకూర్ గారిది.)

## ౧. సరస్వతి మంగళహారతి

యేమిచెప్పుదు కాయపు అనుమాదిరి. (తారకామృతము)

సుకుమారులారా । మంగళమాని పాడరె సుగుణ సరస్వతికీ । జయజయమృదు శుకవాణి గల దేవికీ । శుకుని జనకుని

సకటపురిమరి యికను రుద్రవిరించి నారద సకల సురముని వందితిని బల్ తకిట ధిమిధిమి యనుచు మీరలు ॥సు॥ సొగసైన ముద్దుల చిగురుబోణులు గూడి । అగరు గంధము బూయరే । ముందర నిలిచి తగిన గానమును చాయరే । జగజగన్ మెరియంగ కుంకుమ తగిన తిలకముదిద్ది ముసిముసినగవు నవ్వే తల్లి కత్తురు ఖిగువ పరిమళ ఘుమఘుమయన ॥సు॥ మొల్లావిరులు మంచి మల్లె పుష్పములెల్లయల్లి మెడనువేయరే।ఘనఘన ఘంటలెల్ల నాదముచాయరె । తెల్లశర్కర తేనె దధిఘృత పుల్లగూరన్నంబు దేనియ చల్లచారును ఖుల్లబంబని తల్లి కర్పణజేసి మీరలు ॥సు॥ దండతాయితు గొండలుండు బంగరుపూల చెండ్లచాకటిచాయరే । తీగెయుసరిగ నిండుగళమున వేయరే । పండువెన్నెల దళకుమ కర కుండలంబులు కర్ణములకును । రెండుకరముల కంకణంబులు నిండుగను మెరియంగ చక్కని ॥సు॥ స్థిరమైన వాసరపురములో నెలకొన్న బిరుదైన దొరసానికి । భక్తులనేలు పరమ ప్రకాశినికీ । గరుడరిపు భూషణునిపై రి । మెరపుకళగల దురితహారిణి ధరణి వోలెం పురము ధర్మ నరునిపై కరుణించు జననికి ॥సుకుమారులారా ॥సు॥

## ౨. మమ్మాదేవి మంగళహారతి

నలినాక్షిలారా మంగళం అనుమాదిరి.

కామీని మణులు మంగళమాని పాడారెగౌరి కీశ్వరి కిప్పుడు । మమ్మాదేవి । కామీనిమణికెప్పుడు । సామజానను మాతయై । సర్వదిగ్విఖ్యాతయై । ప్రేమతో శివదాసులకుతా కామి

తార్థము లొసగుచుండును ॥కా॥౧॥ హేమాద్రి ధీరసు త్రామ సన్నుత పాదశ్యామసుందర వేణికి । లోకేశుడౌ । కామారి ప్రియరాణికి । కోమలాంగి సువాణికి । తామరస మృధుపాణికి । భీమవిక్రమమానికి సంగ్రామవిజయ ధురీణురాలికి ॥కా॥౨॥ కనకరత్న కిరీటమునుగల్గి ముత్యాలఘన భూషణములెల్లను । దాల్చినమేటి జనని సంతసిల్లను॥ ఘన సుమంబులు జల్లియు । వినుతిచే రంజిల్లియు । మనసుదీరగ పూజజేయుడి మనముగోరిన కోర్కెలొసగును ॥కా॥౩। పొంగుచు ఇలను యీ గంగాధరునకు యర్ధాంగియై విలశిల్లెనే । ప్రమథ గణంబులుం గొల్వ శోభిల్లెనె॥ సంగరాంగణ దైత్యులఙ । స్వామిద్రోహ చరిత్రులఙ । పొంగిదృంచి జయంబుగను సారంగనేత్రికి యింగితంబుగ ॥కా॥౪॥ ధరణి బొంబాయి పట్టణమందుగల పుణ్యనరుల తారక్షించియు । యీతల్లితో । సరిలేరనగమించియు॥ కరుకు టమ్ముల దాల్చియు । ఘనత బెబ్బులి నెక్కియు । నిరతమును ముల్లోకముఙ భీకరముగను చరియించు చుండును ॥కా॥౫॥ క్షేమమొప్పగను జన్గామ పట్టణమందు । ప్రేమవెల్గ వసించియు । భక్తులుజేయు । ప్రియపూజలును గాంచియు భూమిదొంతుల వంశుడౌ । సోమసన్నిభ మానుడౌ । ఆ ముదంబునబ్రోచు నిక మల్లాఖ్యసుతుడౌ రామకృష్ణుని ॥౬॥

## ౩. లక్ష్మీదేవి మంగళహారతి

దశరథరామ మీ సీతబాధలు దెలుప అనుమాదిరి.

ఇదుగో మంగళము । ఓ శ్రీలక్ష్మి । యిదుగో మంగళము । యిదిగో మంగళము నెమ్మదిని పాదములెపుడు । విది

తంబుగనునమ్మి వేడువారముసుమ్మి । సదయరాలవు నీ కృపాం బుధి । సంతసంబును మాయడనురా । ముదముజూపియు బ్రోవు కరములు । మొగచివందన మాచరింతుము ॥యి॥ సర్వేశుడైన నారాయణుని సతివైయిలలోన । గర్వాంధులను బట్టి ఖండించి ధరలోను । పర్వానులకు ముదముపాదు కొల్పియుమేలు । నిర్వహించియు దిగ్జయంబుగ । యూర్విగల జనులకును సిరులతి । పర్విరక్షించెనని మహాపభ్రావం బింతనగా వశమే ॥యి॥ నారాయణుండు యుగయుగమందు । ఈ రీతిమెండు సారుప్యము నయే యవతార మెత్తిన నీవా । శౌరికి తగురీతి సతివైతివి నీదు । నేరుపింతని యెన్నవశమే నీరజాసనుకైన లోకాధార మీవని పండితులు నిను కోరికోరి నుతింతురహహా ॥యి॥ సాకల్యముగను మీకృపతో ఈ లోకంబులకును । ప్రాకటముగ ధనము పాప్రింపసుజనులా నేకంబుగను యజ్ఞాకంబులునుచేసి । శ్రీకరుండగు పద్మనేత్రుని లోకమున కేతెంచి సౌఖ్యము । స్వీకరింపుచునుండి మిమ్ముల నేకముగ మది బొగడుచుండిరి ॥యి॥ శ్రీ మైలావరము యందున గలుగు మీమీస్థావరము । కామితార్థము మంచి కట్ల వంశజుడైన । ఆమోదయుత నారాయణుని కెల్లపుడు బల్ । క్షేమ మొసగియు శాల్మలిపురి స్థిరయశుండగు వెంకటాఖ్యుని ప్రేమతోరక్షించి వెలసిన యామహాచ్యుత రాణివై తివి ॥యిది॥

## ౪. శ్రీ సత్యనారాయణ మంగళహారతి

హరిణాక్షులారా మంగళం అనుమాదిరి, (పెండ్లిపద్యం)

నారీమణులు సత్యనారాయణునాకు నీరాజనము లివ్వరె । అతివలు మంగళారతియని పాడరె । సారసాప్తకులాబ్ధి హిమ

కర । నారనీరదకార సుగుణవి । చార దురితవిదూర రణజయశూర మన్మధకార యనుచును ॥నా॥ జంభారి సమవైభవంబు జెందిన శూర అంబుజవనమిత్రుకు । హాటకచేల కుంభిని బహు పాత్రుకు । శంభుసుత భువికుంభకుంభము జృంభణంబునుజేసి సింహము డింభుడగు ప్రహ్లాదు కొరకు స్తంభమున జనియించు హరికి ॥నా॥ రాజాధిరాజ సురరాజవందిత కల్పభూజ ఆశ్రిత పోషణా । నుజ్వలతేజ పూజితమణి భూషణా॥ రాజితంబుగ చెరుకువంశ రాజయాఖ్యునిబ్రోవు నిరతము । తేజముగ కరిరాజ యానలు యాజగన్నుత మూర్తికిపుడు ॥నా॥

## ౫. సత్యనారాయణ మంగళహారతి

ఓరామ రఘుకులసోమ అనుమాదిరి. (హరిహర)

తోయజాక్ష హారతులొసగెద సత్యనారాయణాదేవా । సుజన విధేయ మముబ్రోవా । సురచిరకాయ యిటురావా॥ కాయజ జనకసూ । కరగుణజాల । ధీయుతవర జగధీశ సుశీల సహాయము గమ్మి । అఘములు బాయగజిమ్మి ॥తో॥ గానలోల నారదముని పూర్వకాల మందునను । చరించుచు భూస్థలంబునను । దయగల మానసంబునను మర్త్యుల క్షోణిలోగనెను । నానాయోనుల యందు జనించియు।నానాక్లేశము లనుభవించియు।గానరై రిహరి పదకమలంబుల ధ్యానమించుకను । భక్తి నిధానముంచకను ॥తో॥ కాశీపట్టణమున గలపేద భూసురునిగాంచి । బ్రాహ్మణవేషము ధరియించి । వ్రతవిశేష మెరిగించి । ధన్యుని జేసితివిమించి । శ్రీశవ్రతమతడు జేయుచునుండగ । వాసిగ సమిధలు మోయుచు

నెండను । గాసిలి దాహముచే నొకడొచ్చియు । జూచి భయ భక్తిన్ । వ్రతమును జేసిగొనెముక్తిన్ ॥తో॥ భూమీశుడు ఉల్కా ముఖనాముడు నోముకొనుచుండన్ । నచటికి ప్రేమమదినిండన్ । ఒకానొక గ్రామముననుండిన్ । శ్యామలాంగవిను సాధనేవాడు కోమటి చేరియు కోరికలీడు । ఈమహావ్రతఫల మేమిగలదో । వచియింపుడని పలికెన్ । తెల్పెయామహీశుడికన్ ॥తో॥ శ్రీని వాస సంతానముగల్గితే నేనొర్తునని । జనిగనివాని నందానీ । వ్రతమును మానె ననివాని । కానిపోని కడుకష్టము ద్రోచియు । క్షోణిలోన యవమానతచేసియు । దానవారి యతివేషమువేసి బిరానమొరవినవే । బలుదయతోను కృపగనవే ॥తో॥ గోపకులొక యుద్యానవనంబులో శ్రీపతివ్రతము । జేసిరి వోపిసమ్మతము । మనసుకలాప భవహతము । భూపతి తుంగధ్వజు డరుదెంచి । గోపాలులభక్తిని దూషించి అప్రసాద మంగీకరించక ఆపదల జెందెన్ । బుద్ధిలోపముకు గుందెన్ ॥తో॥ ధారుణీశుడు రయం బున । వ్రతము కోరికతోజేసెన్ । యిడుముల దూరముబాసెన్ । ఇతరాచారముల రోసెన్ । ధారుణి తిమ్మపురి సర్వేశ మారజనక మృధుమంజులభాష । శ్రీరమేశ విఠ్ఠల కవిపోష పురాణసఖరారా । భవభయదూర దధిచోరా ॥తో॥

## ౬. సత్యనారాయణ మంగళహారతి

హనుమాలంకలో సీతను అనుమాదిరి. (కూచ. సుం)

సత్యనారాయణ స్వామిన్ మంగళం । భవతే కమలోద్భవ భవప్రముఖముని । నిత్యరాజిత శ్రుతగామి మంగళం । నిత్యభక్తి

యుత । భృత్యవర్గకృత నృత్యగీతసాహిత్య నందాదిత్య జయ ప్రద । ప్రత్యగాత్మ సాంగత్యవరద బుధస్తుత్య చరితతే ॥స॥ శృంగారార్ణవ మంగళకరవిగ్రహా । ప్రోద్యచంద్ర రత్నస్థకిటకరంగ పూజితయుత భక్తానుగ్రహ । అంగజ జనక విహంగధ్వజ భవ భంగ హాటకపిశాంగవ సనగుణసాంగ వేదవేదాంగభరిత శ్రీరంగ నిలయ సారంగవరదతే ॥స॥ జగదేకరాజితవ్రతసువిరాజిత।సంత తాశ్రిత జనకామితార్థపద భగవన్ యోగీశ్వర మానసపూజిత।మృగ ధ్వజానన జగజ్జనకమణి దగద్ధగిత పన్నగేంద్రతల్ప । ప్రగల్భ గుణభవ దగద్ధమహాను గమ్యపాదతే ॥స॥ శ్రీభీమవరపురి మందిరఖేలన । భూపాలధర్మ వేంకటాచొక్కారా యాఖ్యాభీష్టార్చిత బుధపరిపాలన । శోభాస్కర సూర్యంబుసరోరుహానాభ । కౌస్తుభ సుభచరణ । మహాద్వైభవ నిర్లోకకృపావర । ప్రాభవ వర్తిజన శోభనదాయక ॥స॥ శ్రీమదార్షువ పట్టణసువిహారకా । వెంకటగిరీశ్వరైశ్వర్య నామక్రేవ్యోత్రి జగన్ లోకోద్ధారక । సోమవదన ప్రియధామజగన్నుత రామసింహకవి క్షేమంకరగుణ । ధామపర్తికట సుధామధురావచన । స్తోమపర్తిాహిత పార్తిమని గతే ॥స॥

## ౭. శంకరుని మంగళహారతి

అన్న ననుకరుణించుమ అనుమాదిరి. (డాంగ్నె. నా)

మంగళంబనిపాడరే పొంగుచుసత్యా గంగాధరునకు ॥మం॥ అంగనలారా చెంగలింపుచు లింగమూర్తి నివేడి । సారంగ

రాగములబాడీ । అంగజవైరి యానందమొందజయ ॥మం॥ మల్లి కార్జున మాన్యుడె । భల్లాణరాజు ఇల్లాలినడగెను ॥మం॥ చెల్లమ దేవియు చల్లని కడువమెల్లగ దీయగజూచి।ఘల్లు ఘల్లున వెంబడి నడిచి । యిల్లుజేరి చిన్నపిల్లడయ్యె జయ ॥మం॥ వెండికొండ నివాసుడే । దోర్దండబలుడు అఖిలాండరూపుడు॥ బండనత్రిపురుల చెండాడియు బ్రహ్మాండమేలిన శివుని । నమ్మియుండవలె వృష భవుని । నిందుభక్తులను దండిగబ్రోచును ॥మం॥ వన్నెలపుర వాసుడే । పన్నగభూషణు పరమదయాళువు । చిన్నగచంద్రుని శిరమునదాల్చిక యున్నడే పార్వతిప్రియుడు । ధ్యానించు భక్త లకుజయుడు । ఎన్నగాను భావన్ననేలుజయ ॥మంగళం॥

## ౮. శంకరుని మంగళ హారతి

సమయమిదుగో నేడురాఘవా అనుమాదిరి.

నిటలనయన భవతెమంగళం । విభ్రాట్భుజగ ఘటకశుద్ధ న్ఫటితమంగళం । రిటశితాంగ్రి తటపిటాద్రి కటకభూత కట కదిఃకృట । స్ఫుటకటాక్ష నటత్ ప్రమత భటశ్రీభాద్ర వటమా నట ॥ని॥ చటులబురద వృషభనాధ్వజ । శూలభద్ర నిష్కపట కృపలో ద్వితకృపీటజ । నటత్ప్రమత కుటిలజైచ్య । జటు శిరోత్కటాద్రిశూల । కటకుతార ఘటనఘటిత్ । ఘటనఘటననటన వరదా ॥ని॥ ఖటితభాంగ నీలకంధరా । గంగాధరముకుట శాదుధీవ రంధరా । కుటిలదీక్ష వికటమకజ్ఞా । ప్రకటకల్యోత్కట క్రయో ధనుల । పటులరౌద్రాద్రి ఘటదనర్సం కటనివారక ॥ని॥ తటి

నిధవతు నీరళంకరా।గౌరీశహటక పటుళరప్రాతసనభయంకరా । నటద్భృంగి ఘటస్వరస స్ఫుట సంగీత నటప్రియధర । ఘట మృత్యుం ద్యోత్కటప్రతాప ప్రకటభక్త వికటవిజ్ఞజ్ఞా ॥ని॥ స్ఫుట వగమృత వార్త్తిగుణవ్రిజ । కవి రామసింహాఖటిని సురత్పాద పంకజా । జటివిలోల । స్వటియ యశ్రృపటలవశ్యనిటల భక్త పటు శ్రీరాఘవ పట్టణమందిర । ఘటమట ప్రానటప్రకాశ ॥నిటళ॥

## ౯. శంకరుని మంగళ హారతి

యింతెచాలును రాఘవ (కూచ. రా)

విశ్వేశ్వరస్వామినా భవతేమంగళం । సర్వేశ పార్వతి ప్రాణలోల శ్రీ । విశ్వరాదిత ప్రదజయతే మంగళం ॥వి॥ విశ్వాంబర మహోదైశ్వర్యదహరి దశ్వపవ్రిజత ఋషీశ్వరనుత । వృషభేశ్వరధ్వజ । ఫణీశ్వరకటక । గిరీశ్వర పదగౌరీశ్వర జయశ్రీ ॥వి॥ అక్షీనానుగ్రహ । లోకోద్ధారక । సద్భక్తలోలా శ్రితజన పరిపాలక దక్షాధ్వరధ్వంసక । భవతారక । అక్షయవరద । కటాక్ష సత్యప్రత్యక్ష । ఫలదరుద్రాక్షాలంకృత । రక్షోబలభట శిక్షకరణలయ దీక్షాద్భుత పాలాక్షజయశ్రీ ॥వి॥ కుంభినసమణి పోద్రిద్యద్గ్రైవేయక త్రిపురాంతకాంత కాంతక శశిశేఖర । గంభీర గుణార్ణవశోభనదాయకా । కుంభినిరతదంభ పరాక్రమ । శుంభ ద్భులము నిడింబకరక్షకా । బంభరనిభగళ, శంభరహర విశ్వం భరసఖ శివశంభోజయశ్రీ ॥వి॥ మోఘాప్రపంచక రహితప్రభావ । జగదేక శరణ్యాపన్నరక్షకా । మోఘాయుధ నిరుపమ శుభవై

భవ । మేఘకేశ నిర్లాఘహోగ్ర । సర్వాగాఘ్న ప్రతాపగాఖిల
ఘటనఘటన । సర్గాగపతీదర । రాఘవపూజిత శ్లాఘనిలయశ్రీ ॥వి॥
కవిరామసింహ నిరంతరపోషణ । నిష్కపటభక్త సాధుజనోద్ధ
రణ । సువిచారభవ రిపుజన మదశోషణ । ధవళవర్ణ లిప్త
విభూతివి । రవిరల విద్యుత్ప్ర విమలాంగ శృతిభువన చతుర్దశ
భువన నియామక దివిజప్రముఖ సంస్తవన చరితతే ॥విశ్వే॥



## ౧౦. శంకర మంగళ హారతి

నారీమణి నీవిందురా అనుమాదిరి. (సుంద. నా)

చంద్రశేఖరనీకు జయమంగళంబు । జయమంగళంబు
నిత్యశుభమంగళంబు॥ చంద్రాదిత్యులు చలగినిన్ను వృషభేంద్ర
వాహనుడనియు । గుణసాంద్రుడవని నినుగనియు । నిలరుంద్రత
పూజలు రూపింతురుబల్ ॥చం॥ నిన్నుగొని పూజించు నియతాత్మ
లెల్ల।నియతాత్మలెల్ల నిర్భయమొందిఅల్ల॥ని॥పన్నగభూషణ పరమ
కరుణయుత్పన్నుడవని నినుచాల । నేప్రార్థింపుచు విడజాల । నను
కన్నతండ్రివలె మన్నించుముశ్రీ ॥చం॥౨॥ నిండుభక్తితోడ
మార్కండేయమౌని । మార్కండేయమౌని నినుగొండాడేపూని ।
నిండుప్రీతిమౌనికి వరములు మీరండజేరి యొసగినరు । యాదండ
ధరుని దరిమినరు । ప్రచండమూర్తి ప్రజ్ఞుండ వీవుబల్ ॥చం॥౩॥
కోటిభాస్కర తేజకుదరేంద్రచాప । కుదరేంద్రచాప । సురకోటి
ప్రదీప । సాటిలేరు నెచ్చోటు నీతోనదిజూటు డవనిమదిలోన ।
యేర్పాటుగ దలతుశాన । బల్సూటిగబ్రోవు త్రిశూలపాణి

నను ॥చం॥౪॥ హేమశైల ధీరశూర యిస్పాయిప్యాట। యిస్పాయియిప్యాట । లో నుండితేట॥ పాముల ముత్యాఖ్యుని బ్రోచితి పతిప్రేమతోడ కైలాస । గిరిధామజేతు నినుధ్యాస। సుత్రామ వినుతనను దయతో బ్రోవుమి ॥చం॥౫॥

## ౧౧. శ్రీ భృగుమహర్షి మంగళ హారతి

అంగనలు గోపాలునకు జయ అనుమాదిరి.

మంగళం భృగుమౌనిచంద్రా సారంగ నిభనేత్రా । మేటి మంగళ ప్రదగుణగణాకర మహితచారిత్రా । గంగాధరవిది రంగనాయకులుంగాంచి మీ కెంతేని క్షేమముం గలుగజేసి నారా హాహా ॥మం॥ భానుకోటిసమానతేజసు పంకజారిముఖా । వర సుజ్ఞానమానస లోకపూజితమౌని మర్థ్యసఖా । మీనకేతన సుంద రాంగ మీలోనప్రజ్ఞ లెన్నోగలవు మీనేర్పు లెన్నంగ వశమే ॥మం॥ నీతిమార్కండేయు పౌత్రకువై తిపీ ధరలో । బహుప్రఖ్యాతి మిముదలచినను కనబడుదు విటుకలలో । ఖాతిమీరగ పద్మశాలి సుజాతి పెంపుగోరియెంతోచేతో మోదమొసగియున్న ॥మం॥ వేదశాస్త్రపురాణ చరితము లాదిగనుజదివి । హృదయామోదముగ సర్వంబు దెలిసియు పాదుగనుపృధివి । కాదారరూపు శ్రీహరి యటంచును నీదుమదికి శౌరిభక్తి పాదుకొల్పియున్న పహాహా ॥మం॥ కోరికలరగబొడ్డు రాజాఖ్యునికి శుభమిచ్చి । సత్కృపయూరియును గోవిందుపేటలోనుండి మదిమెచ్చి । పార వార విహార నందకుమారు నెంతోదలచి భక్తిమీరియున్న మౌని చంద్ర ॥మం॥

## ౧౨. మార్కండేయ మంగళహారతి

ఎటులైన గురురాయనన్ను అనుమాదిరి. (విప్రనా. చ)

మంగళం మార్కండేయనీకు । మౌనివర్య శుభము లొసగుమాకు ॥మం॥ మంగళము భవభంగ వేద ప్రసంగనిర్జిత పుంగవార్చిత । మంగళం భస్మాంగలేపనయింగిత ప్రభులింగ పూజిత ॥మం॥ చండమార్తాండ తేజప్రకాశ । చంద్రమౌళీసేవిత కలుషనాశ । అండజాధ్వజ పుండరీకాక్షుండ సంస్కృత కుండలా ధర । అండగొని బ్రహ్మాండభాండము నిండుగను దోర్దండ ఋషికి ॥మం॥ ధరమృకండ సుందరవరసూన । ధర్మహృత్కమల చరితప్రమాన । పరమపావన కురువరాధిప శరణు కరుణా. కర విశేషణ । సరసిజాసన కరుణసాగర నిరతనిర్గుణ లక్షణ కర ॥మం॥ భృగుమహాముని పౌత్రసూత్ర । బుధవరేణ్య సంపద గుణమిత్ర । అగరుగంధము మేనబూయుచు । మగువలాదిగ పురుషజనములు । సొగసుమీరగ విరులవర్షము అగణితంబుగ గురియగాను ॥మం॥ భాసురసన్మని మందహాస । భక్తజన కల్పద్రువ చిద్విలాస । భూసురార్చిత కూచగిరిధరవాస యోగ భ్యాసయెల్లా దాసజీవనవో సదయసుగుణా సముద్రి సదాశివ ప్రియ ॥మంగ॥

## ౧౩. భావనాముని మంగళహారతి

శ్రీశంభు తనయునకు సిద్ధిగణ అనుమాదిరి.

మంగళం శతకోటి మార్తాండ తేజునకు । మంగళం భృగు వంశ పుంగవునకు । మంగళం దేదీప్యమాన కోటీశునకు ।

మంగళం భావనమౌనికిపుడు॥ జయమంగళం నిత్య శుభమంగళం ॥మం॥ ధరణిమార్కండేయ తపసిహోమముజేయ నవరత్నమయభూషణములతోను । అరుదైన సకల దివ్యాయుధంబులతోను । పరగజననంబైన భావనమునికి ॥జయమంగ॥ పద్మనాభుని నాభి పద్మతంతులుదెచ్చి పద్మశాలికీర్తి ప్రిభలజగతి । పద్మలోచనుతాను బావమరదులుగాను । పద్మకనజుండైన భావనామునికీ ॥జయ॥ పరమేశుడిచ్చిన పద్మతంతువులతో । వరుసగాను పంచవన్నెలుగల । కరమర్ధివస్త్రములు గావించి సురలకు । పరగంగనొసగిన భావనాఋషికీ ॥జయ॥ పులుల వెదకితెచ్చి పులితోలు శివునకు వలువలు సమర్పించి వారిచేత । బలువ్యాఘ్రికేతను బసవశంకరిబిరుదు । పొలుపొంద గైకొన్న భావనాఋషికీ ॥జయ॥ భద్రిముగ హరిహర బ్రిహ్మాదులునుమెచ్చ । భద్రవతికన్యను పెండ్లియాడి । భదేశ్రి భూసురులు బ్రితుకుమని దీవింప । పద్మవంశావళి భావనాఋషికీ ॥జయ॥ హోలమున ఘోర శార్దూలంబుపైనెక్కి । కాలవాసురుద్రుంచి ఘనతమించి । మోలుకాసురుతలలు మూడుబాణములధర గూలవైచిన శౌర్యశాలికిపుడు ॥జయ॥ గరిమవెంకట కృష్ణకవిని రక్షించిన । వరబుధులు కీర్తింప ప్రిభలముగను । పరమాత్ముడగు అహోబిల నారసింహానకు । వరభక్తుడైన యా భావనాఋషికీ జయమంగళం నిత్య శుభమంగళం జయతు జయమంగళం । మహోత్సవమంగళం॥మ॥

## ౧౪. భావనాముని మంగళహారతి

అయినసారథి లేకపోయె. (సభా. నా)

మంగాళమిదొ భావనార్య । మౌనీంద్ర సాహససుగుణ సాంద్ర ॥మం॥ ఇంగితంబునమీరు మార్కండేయ యజ్ఞములో జనించియు । పొంగిభద్రావతిని పరిణయముంగొని సంతోష లైతిరి ॥మం॥ జననంబుతో మీకుగలవు । వివిధాయుధములాభరణములుబల్ ॥జ॥ అనఘునీవటు వ్యాఘ్రవాహనువయ్యి కాలువసురు వధించియు । ఘనతరంబుగ విజయమును చేకొనియు వెలసితి విందునందును ॥మం॥ హరినాభి పద్మతంతువుల । గొని తెచ్చివానిని పంచరంగుల ॥హ॥ నెరిపి మీ మహాత్మ్యమును సంబరముగను వివిధాంబరంబులు । త్వరగజేసియు హరికి సురలకు పరమప్రీతీ నొసంగినారలు ॥మం॥ హరిని మెప్పించియు మీరు । హరిచేతవరముల్ గొన్నవారలు ॥హ॥ హరునకు పులి చర్మ మొసగియు హరుని కారుణ్యంబువడసియు । పరగ ధరణిలో క్షేమమిస్త్రిరి పద్మశాలి వంశమునకు ॥మం॥ గోవింద పేటలొనిలిచి । కోవిదజనంబుల బ్రోవదలచి ॥గో॥ వావిరిగ సత్పుణ్యచరితుడు వంగనృసింహాఖ్యు సుతుడౌ । ధీవరసు గోవింద యాఖ్యుని శీవిచెలగగ బ్రోచినాడవు ॥మం॥

## ౧౫. శ్రీ నరసింహస్వామి మంగళహారతి

చిరుతనీయిల్లేల అనుమాదిరి. (చిరుతొండ)

మంగళమిదొ నారసింహ । సంగీతలోలవైరిదంహ ॥మం॥ మంగళాకర గుణగణపద్రిద । మంజుదేహ ముకుందలక్ష్మి ।

అంగనా మణిలోల శీల । కురంగనేత్ర విహంగవాహన ॥మం॥
కుంభీంద్రవందిత నన్నుగావు।స్తంభమునను జనియించి నీవు॥కుం॥
జంబవైరి హిరణ్యకశ్యపు జీరి ప్రహ్లాదునికి కోరువరంబు నొసగి ముదంబు దేవగణంబులకు నొనరించితీవి భళి ॥మం॥ రామావతారమునందు నీవు । భూమిజకోసర మయ్యెలావు ॥రా॥ తామసంబున లంకకేగియు । భీమరాక్షసులను వధించియు । ప్రేమతోడుత నావిభీషణు బిలచి రక్షించినమహాత్మ ॥మం॥ ద్వాపారయుగమందు జన్మించి । గోపాంగన మణుల గారవించి ॥ద్వా॥ గోపకులనుగూడి యాడుచు గోగణంబులగాంచి కంసుని । రూపణంచిన నందనందన । నీ పదంబుల కేను మ్రొక్కెద ॥మం॥ ధారుణిచుక్కాపురి విహార । కారుణ్యసాగర మేరుధీర ॥రా॥ వేరుచాయక అక్కాపురమున వెలయుపాముల ముత్తయాఖ్యుని । కోరికలరగ బ్రోచినాడవు కోమలాంగా పాండురంగ ॥మంగ॥

## ౧౬. శ్రీ నారసింహ మంగళహారతి

ఇటురావె సఖి అనుమాదిరి. (సభాపర్వ. నాట)

నీరాంజనము నారసింహ । గొనుమి రాక్షసావళిదంహ ॥నీ॥ నిరేరుహాక్షముకుంద । నతసురిందర్ప పదారవింద । శుభసారూప్య నీ సుగుణారాశినెంచెద ॥నీ॥ వైకుంఠ వాసమురారి । నిను వర్ణింతు దానవదూరి ॥వై॥ సాకల్యముగ నీవంటి సుశ్లోకులు లేరని వింటి । యాలోకా లోకముల కేకవేల్పువు ॥నీ॥ కారుణ్య

సాగర దేవ । యిటురారమ్మిక ననుబ్రోవ ॥కా॥ నీరూపము గని మేము మది కోరికోరియున్నాము । నీవారూపు జూపుము ఆమోద మౌను ॥నీ॥ ధర శ్రీయాదగిరీశ । దయరావలెను జనపోష ॥ధ॥ స్మరింతునిను వనమాల సీతరామాఖ్యుని చాల, యాదరించి బ్రోచిన దామోదరుడవౌ ॥నీ॥ గుణాఢ్య సికిందాబాదు । పట్టణంబులోనను నీదు॥ కనంగినామము చాల । పిక్కటిల్ల దల తురుశీల । వాకక్షణంబైన స్వరూపుజూపుమి ॥నీరాం॥

## ౧౭. శ్రీ నృసింహస్వామి మంగళహారతి

జలాజాక్షి అనుమాదిరి. (డాంగ్నేయ. నా)

జలజాక్షనరసింహ యిదోమంగళం ॥జ॥ కలికి లక్ష్మిదేవి నీదు వామాంకమున మెరయుచుండ భక్తజనమన । ములనుగల్గు కోర్కెలెల్ల సలలిత । ముగను దీర్పబిరుదు దాల్చినాడవు వో ॥జ॥ కరుణించుమనివేడ ప్రహ్లాదునిఁ ॥క॥ మొరలువినియు స్తంభ మందున సత్వరగ జననమొంది హేమకశ్యపు । యురము వ్రక్కలించి దృంచిబాలుని పరమప్రీతి నేలినాడవు వో ॥జ॥ నిను గాంచి । సురలెల్ల భయమొందిరిబల్ ॥జ॥ దనుజవైరి దర్పము డిగిమమ్మల కనికరంబునఁ గావుమంచును । వినయముగను కరములెత్తి మిమ్మల । వినుతిజేయలేర నాడుభక్తితో వో ॥జ॥ క్షితిభార । మణగించ నీవెంతోబల్ ॥క్షి॥ కృతయుగంబుజేసి యుగయుగంబున మితముదప్పక వతరించి దనుజుల । హతము జేసినీవు భూరిపుణ్యతతికి మోక్షమిచ్చి బ్రోచినాడవు ॥జ॥

దయజూడు నింబాద్రి శ్రీశౌరినక్ష ॥ద॥ భయవిరహిత నింబ దాసునకు నిలజయ మొసంగదలచితే వేగమె । రయముతోడ నేగుదెంచి మోర్తాద్వారియందు నిలచినాడవు వో ॥జ॥

## ౧౮. వెంకటేశ్వర మంగళహారతి

శ్రీరాములవతరించె. (ధర్మపురి అనుమాదిరి. రా)

జయజయమంగళం శ్రీ వెంకటరమణా తవజయమంగళము । నయగుణభవహర నారదవందిత । జయలక్ష్మీపతి జాగ్రత శుభకర ॥జ॥ మండితకుండల । మణిభూషణ శ్రీభూమండలాధారణా । నిండివెలయు యఖిలాండ మూర్తియగు । చెండితవర బ్రహ్మాండనాయక ॥జ॥ సామజవాహన । సరసీరుహనయన । కామితపాలనా । భీమపరాక్రమ కామజనక యో సోమవదన పరంధామ రాఘవ ॥జ॥ సనకసనందన । సన్మునివందన వనరుహలోచన । ఘనమణిమయ । సద్వినయవిభూషణ । కనకజనార్చితకాంత శ్రీహరి ॥జ॥ కుండలధారణ । వరపురిశ్రీ తోర్లికొండవిహారణ । దండధరార్చిత దరిజేర్పగదే నిండు కృష్ణకవినాథభూపతే ॥జయ॥

## ౧౯. వెంకటేశ్వర మంగళహారతి

శ్రీ సత్యనారాయణ మంగళమహా అనుమాదిరి.

శ్రీ వేంకటేశ్వర మంగళమిగభవ సంకటహార చరితా పంకజహితా । బ్జంకహిత । పంకజాంఘ్రియుగ పంకజనిభహితా పంకజాసనహిత ॥శ్రీ॥ ధృతచక్రాయుధ పతితపావనాచ్యుత మణి

మయభూష । క్షితిపోష భవనాశ । క్షితిధరసంతత నారదవందిత సుందరమణివేషా ॥శ్రీ॥ పరమ కరుణసాగర దామోదర పరమ భక్తలోలా । పరిపాల । శిరిలోలావరజగ సాగరపురి గిరిమందిర హాటకమణిచేలా ॥శ్రీ వేంక॥

## ౨౦. ఆంజనేయుల మంగళహారతి

మాటమన్ననజేయుమా అనుమాదిరి. (హరిశ్చ. నా)

మారుతాత్మజమంగళం । శ్రీరామచంద్రుని భూరిభక్త వర ॥మా॥ సూరిజనపరివారములకు మందారతుల్య చాతుర్యా । హేమేరునగసమధైర్యా । వారణగమనా । వాయుశరీరా ॥మా॥ దక్షాధ్వర విధ్వంసకా । నిర్లక్ష్యముగను రవిన్భక్షించినవర ॥ద॥ పక్షివాహనుని కుక్షిలోనిడి యీ యిక్షుదధిలంఘించి । బల్రాక్షసులను మర్దించి । నీలక్ష్యమెన్న కంజేక్షుని వశమే ॥మా॥ క్షోణి సిరిపురమందిర । హోదానవాంతక దీనపోషణ ॥క్షో॥ మానకుండ నీనామమెపుడు నా ధ్యానమందునను నిలుపు । మునుజేయు కలుష మునుదులుపు । నామానసమున మిముమాన నిమిషము ॥మా॥

## ౨౧. ఆంజనేయుని మంగళహారతి

మంగళమిదిగో శ్రీరఘు అనుమాదిరి. (కూచ. సుం)

మంగళమిదిగో అంజనితనయా మహాసద్గుణ వినయా॥ మం॥ సంగరవిజయ కురంగనయన మమ్మంగని బ్రోవుము మొక్కెదమిదుగో ॥మం॥ శ్రీరామచంద్రుని పాలిటిభక్త । భవసంకటరిక్త । కారుణ్యసాగర సద్గుణయుక్త సూరిజనస్తుతి ।

ఘోరాసురహతి । పారవార గాంభీరమానస ॥మం॥ సీతేశు నాజ్ఞచే నీరధిదాటి । లంకలోయామేటి । సీతాంగనమణినిఁ గని సురకోటి ఖ్యాతిగవేడ పురాతనరాక్షస భూతలన్నిల ఘాతజేసి తివి ॥మం॥ నీవంటి బాహుబలాఢ్యులులేరు యెన్నగ మహాశూరు । వైవాసికెక్కితివి నగధీరు । వేవేగను బహువేదశాస్త్రములు । సావధానముగ చదివితివౌబల్ ॥మం॥ శ్రీయున్నతిగలిగియును బహు గొంటె । వంశజుడై యెప్పు సాయూఖ్య నేలితి వితరులు గంటె । శ్రీయుతముగ రెంజర్ల పురంబులో రేయింబవలు వేంచేయుదు వౌభళీ ॥మం॥

## ౨౨. శ్రీ కృష్ణమూర్తి మంగళహారతి

తోయజాక్ష హారతులొసగెద అనుమాదిరి.

మంగళమిదొ గోపాంగనజన మదిరంజిత గోపాల । సుర మునిపుంగ వినుతిశీలా । కలుషవిభంగ నందబాలా । మంగళ ప్రదభుజంగశయన । సారంగనేత్రి క్షేమంగలుగను । జేయం గనురారమ్మి । దోషములుంగని బోజిమ్మి ॥మం॥ పాదుగనట కంసాది నృపాధము నీధరబాధింప । యావలభేది వారినొంప । జాలకనీదు కరుణబెంపా । రాధవినుత ప్రార్థనజేసిన దామోదర యదుకులమున బుట్టితివపరాధుల వధియింప । వశమే యిక మిమువర్ణింప ॥మం॥ వసుదేవ సుదేవకికినిరాతిరి పొసగను జనియించి । యాదవపురమున కేతెంచి । సంతస మొసగ నీవు మించి । పశులగాయ యదుబాలురతోజని అసుర మూకలను

హతముజేసితివి । వసుదేవకుమారా । సుందర బిసరుహాక్ష రారా ॥మం॥ ఒకనాడు గోపకుమారుల గూడుక పశువులను గాయ । యడవికి ప్రకటితముగడాయ । జని ఖిల్లకముగను శ్రేయా । కుకలుష కాళింగుని మడుగున నీ । దుకరంబున బట్టుకొ నాడిన మీ । ప్రకటనయేమందూ । నినునే ప్రార్థించెదముందు ॥మం॥ గురుతరముగ నాకౄరుతో మధురాపురమున కేతెంచి । భక్తుల నరసిగారవించి । కంసునిదురమున వధియించి । యురుతర రాజ్యము నుగ్రసేనునికి । కరుణతో నిచ్చియుగాచి జనకుని చెర మాన్పితివయ్యా । నీసరిధారలిల లేరయ్య ॥మం॥ ద్రౌపది వేడిన తగినవస్త్రములు తడయకనీవిచ్చి । ధర్మజుని పుణ్యమరయ మెచ్చి । కౌరవభూపుల నటువ్రిచ్చి । పాపపుణ్యముల పాలన జేసిన నీ పురుషార్థము నెన్నగవశమే శ్రీపతి కరివరదా । మకరిని రూపణంచలేదా ॥మం॥ నందతనయ గోవిందపేటలో నందంబుగ నిలచి । క్షేమము లందజేయ దలచి । సత్కృప సాంద్రుడవన సురచి । రంబుగ వంగ వంశాంబుధి చంద్రుడనందగు నృసింహాఖ్యాత్మజు గోవిందాఖ్యునిబ్రోచి । తివి గోవిందుడవన జూచి ॥మంగ॥

## ౨౩. నారాయణ మంగళహారతి

సమయమిదిగో నేడురాఘవ అనుమాదిరి.

జలజనయన శుభదమంగళం । రఘునాధసజల । జలజ మృదుకలిత మంజులం ॥ లలితభ్రమర తులితచికుర । చెలిత

పటల కలితనిటల జలదిదుహిత లలితస్ఫుట హృజ్జలజనట। దోత్కలితషట్పద ॥జ॥ స్ఫుటప్రయోజనాభ భవహరం। నట రచితరంగ పటలకృపజ దాభ్యభాస్కరం। నటదలిత్‌భ్రాత్‌ కుటిల సంస్కృత తృటిత్వాస్కంధ దిటప్రకాశ ప్ర। కటిత ఖడ్గోత్కట వీభ॥ దటవిభరీ హీర్‌హృత్పటలా ॥జల॥ పృథివిచక్రమౌన్య కేసరి పుష్కరదృగ్యు పదక్ష తీశనందనంహరి। పృధివిచక్ర రథికవినుత పృధులఫణి భుగ్రదీప శతమన్మధ వవిపుద్విటల్‌। మధితదోర్ద్రిడ్ధృతి విభూతి ॥జ॥ విధివినుతత్రిభువన పాలన। శరదభీషపూర్ణ విధితధద్యుతీర్ణి బాణన। బుదకదాంబ విజదాద్రి విధృమ। హేధరమందార కుధర ధరసురధుని శతభరపృధ్వి ధనుర్ధలితశ్రీ మధూద్విటర ॥జ॥ భువనభవ భవాభినందితం। భువిలింగనగర భవనమౌని నికరవందితం। భువనహృద్ద్రుమ మగదవనితాంత ప్రవరవరదధృత రామసింహ। కవిస్తుతాంచిత। రామకృష్ణ నృపభక్త సదవియచ్యుత ॥జల॥

## ౨౪. శ్రీరామ మంగళహారతి

అంగనలు గోపాలునకు జయ అనుమాదిరి.

మంగళం రఘుపుంగవాభ్ర నిభంగవిదువదనం। భవ భంగవిహంగ శతాంగనిజద్విశ భంగకృతకదనం। అంగజ పితా నంగళతధృతి। రంగభృంగ సంగకాంతరంగ రాట్‌భుజంగ తల్ప ॥మం॥ గోత్రమహిత కళత్ర శతసిత పాత్రదృశ్యగళం॥ శతమిత్ర దిగ్భ్రమ గాత్రధరధర మాత్రత్రివిలిగళం। గోత్ర

మైత్ర సుస్తోత్ర భద్రచా । రిత్రి పద్మనేత్ర గుల్మధాత్ర శ్రీజగాత్ర యీశ ॥మం॥ ఖండనాశర మండలాధర ఖండలజనావరం । మణి కుండవాబ్జ ప్రకరాండవరదోర్దండ విభవకరం ॥ చండకోటి ప్రచండ రాడ్వే । దండగమ్య దండహృత్కోదండ హస్తదండత్రాణ ॥మం॥ ఇందుభూసుర బృందహృత్సరో విందశత్ర్వపదం । వృషచాంద సహిత నందనుత మకరంద లిప్రపదం ॥ నందనంద పద్మశేతు తరీ । నెందుపాల ఇందిరహృత్కందలితానందశీల ॥మం॥ శౌరి దురిత విదూర వెల్లూటూరి స్థిరసదనం । మురవైరి భద్రిగిరీ రవ రవిహార ధృతిసదనం ॥ క్షీరశరధి విహారసద్గుణ । హారమేరుధీర సుపరిచార రఘువీరజయ ॥మం॥ శ్రీల ధృతిలింగాల వంశగోపాల రాడ్వరదం । జగజ్వాల వరశరజాలదన్న । పాలనేతు ద్విరదం । శూలస్థితి వనమాలిసత్కృప । లీల భక్తలోల దీనపాల పోట్కపోలజయ ॥మం॥ రామత్రిశరవిరామ యదుకులసోమ దివసకరం। యశోద్ధామ సంగరభీమ సర్వశుభాహ గుణప్రకరం ॥ రామసింహ కవిశామాంకరగుణ । ధామనిత్య క్షేమ శ్రీమాణ రామ సీత రామజయ ॥మంగళం॥

## ౨౫. లక్ష్మినారాయణ మంగళహారతి

మేరెమౌలాబులాల అనుమాదిరి, (కవాలిసంఘ)

లక్ష్మినారాయణాచ్యుత నీరాంజనం । గొనుమీనీ రేరుహాక్ష నాకు నీవేఘనం ॥ల॥ సారసోద్భవ వంద్యమీ పదసరసిజంబులె నమ్మినా । వారికీ నిహపరములందున వైభవము లొసగినఘన ।

కోరికోరినిన్నె మదికొనియాడెద । సారెసారెకునన్ను బ్రోవ సన్నుతించెదా ॥౮॥ పాదుగనువెయ్యేండ్లు మకరిచె బాధపడికరి వేడగా । నీదయను రక్షించితివి కరిని మునీంద్రులుమేలనా । లేదానామీద నీప్రేమమాధవా । మోదభరితాత్మ నీవేనన్నుగావవా ॥౮॥ పాటిగనుమీయొక్క నాభిపద్మతంతువు లొసగినా । సూటితప్పక భావనాముని సురలుజూచి భళీయనా । వాటినమరించి పీతాంబరములుజేసి । మేటిముదముతో నివ్వలేదడాసి ॥౮॥ గురుతరంబుగ పద్మశాలికులోద్భవులు పీతాంబరం । పరగమీకర్పించి నను నొంపలర వారలకుఁ వరం । త్వరగామీరిచ్చి రక్షించలేద మున్ను । పరమకారుణ్యమును జేయరాదెనన్ను ॥౮॥ పరమ ప్రీతి చలంగి హాల్యాబాదులో నివశించియుఁ । గురుతరంబుగ పడిగె పెంటాఖ్యునికి వరములొసగియుఁ । సరసీజాతేక్షణ నన్ను సవరించుమీ । దురితదూరమీదాసుండనై తిసుమ్మీ ॥౯॥

## ౨౬. తులసిమంగళం.

అక్కడయుండె పాండురంగడు అనుమాదిరి.

అంగనలందరు తులసికిమంగళ । హారతులివరమ్మా ॥మం॥
రంగనాయకుని ప్రియతరుణికినీ । రాంజనమనరమ్మా ॥అం॥౧॥
కృష్ణునిసమముగ తులదూగిన । కృష్ణతులసి ఇదియమ్మా ॥ఇదికృ॥
ఇష్టముతోడుతపూజజేసి । సంతుష్టిని గనరమ్మా ॥అంగనలం॥౨॥
పతిపదసేవను సతతమొసంగుచు । పాలించునుకొమ్మా ॥మిము॥
హితవు మీర మనకందరకును । సద్గతినొసగునుసుమ్మా ॥అం॥౩॥

ఐహికమందును పరమందును సుఖమంద జేయునమ్మా ॥సు॥ మోహావారధిని మునుగకతల్లిని । ముందుగొల్వరమ్మా ॥అం॥౪॥ వరదాదాసుని మరువకనేలిన । గురునాశ్రమమందూ ॥సద్గురునా॥ నిరతము తరుగక వెలయుచుండు । యిందిరయిదియె సుమ్మా అంగన॥౫॥

## ౨౩ మంగళహారతి - ఆదితాళము

రాజరాజేశ్వర మంగళ నీ । రాజనములను గైకొనుమా । పూజనములను కృపగనుమా । మా ప్రోక్తములను లెస్సగ వినుమా॥ హేజయజగదీశ్వరా । హేగౌరీశ్వరా । మా జపతపము లివే జయశ్రీ ॥రా॥౧॥ కర్పూరారతు లివేసదా । మంగళ ధూపారతు లివేసదా । నేర్పు కెంతవారము దీనులమిక । నీ కృపకే పాత్రులముగదా॥ దర్పకహరఘన ద్రవ్యంబులను స । మర్పణజేసే అధికారులమా ॥రా॥౨॥ అష్టాంగయోగముల నెరుగని మా । సాష్టాంగములే యోగములూ । ఇష్టదైవమా । మా ప్రణతులు నీ యిష్టంబున కనురాగములూ॥ స్పష్టంబుగ నీ చరణములే మా । ఇష్టార్థంబుల నివజాలును శ్రీ ॥రా॥౩॥ మంగళకరుడవు నీవే శతజన మంగళప్రదుడవూ । మంగళనామా । మంగళధామా । మంగళవరదుడవూ॥ మంగళమయ ధవళాంగ మంగళాపాంగ ప్రాణపద । లింగేశ్వర శ్రీ ॥రా॥౪॥ ఓంకారతీతుడ వీ విశ్వో । ద్యోగ సమర్థుడవూ । శంకారహితానుగ్రహపరుడవు సర్వస్వతంత్రుడవూ॥ సుంకేటధామా । శంకరనామా । సంకట హర క్షేమంకరశివ శ్రీ ॥రాజ॥౫॥

## ౨౮. ఆదితాళము — మంగళహారతి

వీరబ్రహ్మము । గారికి మంగళ । నీరాజనములు । పూజనముల్ । తారకరూపున । కర్పింతము గుణ । ధీరులు నరనారీ జనముల్ ॥ప॥ కోరికతో కర్పూరధూపములు । వేరువేరుగా వెలిగింతము ॥శ్రీ॥వీ॥ర౧॥ ఫలములు పుష్పంబులు బిళ్వదళం । బులు గంధాక్షత లగరులునూ । జలములు క్షీరంబులు దధీమధు ఘృత । శర్కర నైవేద్యంబులునూ । బలవద్ధుమద్ధుమ । పరిమళ ద్రవ్యము లలరగ కృతులు సమర్పింతము ॥శ్రీ॥వీర॥౨॥ మంగళవాద్యము లలరగ సాంఘిక । మంగళ గీతంబులుబాడి । సంగీతస్వయం సద్గురుపుంగవ మహిమలు గొనియాడి॥ గంగాధరుడగు లింగేశ్వరగుణ శృంగారముల నెరింగించిన ॥శ్రీ॥వీర॥౩॥ విభూతి శ్రీరుద్రాక్ష మాలికలు వినుతించి సమర్పింతామూ॥ స్వభావముగా । భక్తిపూర్వక నమస్కారంబు లాచరింతామూ । భయప్రదునకు శుభప్రదున కఖీల భక్తులము ॥శ్రీ॥వీర॥౪॥ ధర సుంకేట పుర ధాముని మహదవతార పురుషుడని భావించీ । పరమార్థప్రదుడైన సద్గురుని పరమదైవమని సేవించీ॥ కరుణవేలయమము క్షమించిబ్రోవుము శరణాగత వత్సలయ నిజయశ్రీ ॥వీర॥౫॥

## ౨౯. మంగళహారతి - ఆదితాళము

శ్రీ నింబగిరీ శ్రీ లక్ష్మీ నరసింహ్మా । స్వామి । మంగళముల్ జ్ఞానానందప్రద । భగవన్ । జయజయ । మంగళ నీరాంజనముల్ ॥ప॥ దీనశరణ్యా దీనాబాంధవా దీనరక్షకా । దీననాథ

వరదానశీల గణ గానలోల నీ । ధ్యానము పరమ నిధానము జయ జయ ॥శ్రీ॥౧॥ స్తంభసుసంభవ హిరణ్యకశ్యప । సంహార్మరక మహదవతారా॥ అంభోజాక్ష ప్రహ్లాద నామడింభకరక్షకా సాకారా॥ శుంభద్విక్రమ పరాక్రమా ఘన గంభీరస్వర దైత్యభయంకర॥ దంభోళిచ్ఛ విధంష్ట్రినమత॥ శంభోప్రణుత స్వయంభో జయ జయ ॥శ్రీ॥౨॥ సాక్షాద్భక్తా పరాధీన దయదాక్షిణ్యా । శ్రితజన లోలా రాక్షసఘ్నఘన రౌద్రకార విపక్ష క్షయకర జయశీలా॥ అక్షయ మహిమాయ హత్వవరదకటాక్షక । సత్యప్రసన్నత్వ ద్వ్రితదీక్షక జనసంరక్షకా । హే ప్రత్యక్ష స్వరూపతార్క్ష్యధ్వజ జయ ॥శ్రీ॥౩॥ నీలమేఘస్నిగ్ధ శ్యామలాంగా । కాలచక్ర హస్తా శాశ్వతా । లీలాకర సమయావతారగుణ జాలాశ్చర్య ప్రకాశితా । కాలోచిత రక్షకా । నతజన పరిపా లార్తాత్రిణపరాయణ । సంసీలాకలుష నిర్మాల కీర్తి విశాలా । ఘనవన మాలాధర జయ ॥శ్రీ॥౪॥ సంగేం నరసింహ్మ దాసపోషక సంరక్షక । సుం కేటిధామా । శృంగారరమణా । షుగంళ విగ్రిహా । శ్రీ మన్మయ దైవలలామా । అంగజ జనకా గంగాజనకా । మంగళమయ నామాంగ ప్రికార । రంగదుణ సత్యంగ ఫలప్రద మంగళదాయక రంగానాయక ॥శ్రీ॥వి౦॥౫॥

## ౩౦. ఆదితాళము - కళ్యాణి

శ్రీ సత్యనారాయణస్వామి । జయ మంగళ భవతే । శ్రీలక్ష్మీధవత్వాం నమామి । భాసమానదరహసముఖ మహోల్లాస

పరమ కరుణాసముద్ర సువిలాస బుధాత్మనివాస కలుష సంత్రాస హరణ నిజదాసరక్షకా ॥శ్రీ॥౧॥ సాక్షాద్ద్వైతజన భక్తలోలా। భువన పావనాశ్రిత। రక్షద్ధృత పరమార్థశీలా। అక్షయవరదా। కటాక్షక హే ప్రత్యక్షదైవమా। విపక్ష క్షయకర దక్షక దిగ్జయతా। క్షీర్యాధ్వజ కమలాక్ష శ్రీ నిటలాక్షమిత్రవర ॥శ్రీ॥౨॥ వేదారాధిత గుణనామ విరాజితా। శరణాగత రక్షక। వేదాంత స్తవహే త్రిభువన పూజితా। వాదరహిత నిర్భేదభక్తి। సువినోదక సత్యగుణోదాధి। బ్రహ్మేంద్రాదివంద్య। ప్రహ్లాద రక్ష కా। హ్లాదభరిత। భద్రోదయాత్మకా ॥శ్రీ॥౩॥ వ్రతదీక్షాష్ట ప్రదాభ్యా ఋషిముని సజ్జీవణా। శ్వేత కీర్తిత నిరోపసౌఖ్యా। మతిప్రదాయక। గతిప్రదాయక। స్మృతిప్రదాయక। ధృతిప్రదాయక। క్షితినాయక। సంస్తుతి ప్రియాత్మక। పతితపావనా ॥శ్రీ॥౪॥ దీమద్ధిత। పద వాగ్విలాసా। క్షేమంకర। సంగ్గేము వంశజ। నరసింహ్మదాస। సత్కామితార్థ। ప్రద రామసింహ కవి। రక్షక। జగత్ప్రిమాయస। మంగళనామరూపహే ॥శ్రీ॥౫॥

## ౩౧. మంగళహారతి

(రాములజేరా-భ-శ్రీరామ-య) అనుమాదిరి.

వేడికొల్వరే వెంకటేశు జూడరే। వారిజాక్షులార మంగళమాని పాడరే। స్థిరమూ ప్లశ్లైరమూ। నిర్మదమూ। ఘుమఘుమలు జల్లుచూ ॥వేడి॥ పొందికలరగా। కుందనంబు మెర

యగా । చందనాంగి మకుటము శిరమందు వెలయగా । ముందూ। మనయందూ । దయజెంది శ్రీ ఇందిరేశుని ॥వేడి॥ మాటిమాటికి కోటి రవిప్రకాశునీ । హాటకాంబరధారి యైన మేటిదేవునీ । నోటా । హరిపాట । యేపూటా । మరువకను దలచి ॥వేడి॥ వాసవానుడూ జగతినేలు శ్రీశుడూ దోషములను దొలుగగొట్టు శ్రీనివాసుడూ । జేసు । కృపజూచూ । జగదీశు । భవనాశు నిల ॥వేడి॥ దండధారుడూ తొర్లికొండ వాసుడూ । నుండినేలు మనలసదా పుండరీకుడూ । నిండా । దయయుండా మనయండా । యెడబాయకనూ ॥వేడి॥

## ౩౨. మంగళహారతి

(చాలుమారుతి అను మాదిరి. సభ-నా)

మంగళారతి వాయుకుమార మారుతి ॥మంగళారతి॥ సంగరారి గర్వభంగ సన్మునిపుంగవ స్తుతత్రప్రమేయ । బలయుత । నింగి రత్నకోటితేజ రాక్షస । భంగభంగ భవ పంకజలోచన ॥మం॥ మారసుందరా । రణజయశూర ధీవరా । మేరుశైల ధీరపారవార గం । భీరశూర భక్తకల్ప । భూరుహా । పారసారి వక్త్రికోటి శత సరసీరుహాప్తతేజ వానరోత్తమ ॥మం॥ యామినీచర । జిత రణభీమ శ్రీకర । భూమిక తలపురిదామ కపికుల । స్తోమ యాంజనేయ పాపమోచన । ధీమ తీస్తుతాంఘ్రి తాపసస్తవ కోమలాంగ గంగదాస పోషణ ॥మంగళ॥

## ౩౩. మంగళహారతి

(కలనైన మరువాలేనె. అనుమాదిరి-సభ. నా)

మంగళారతు లివ్వరే । మాతాంగ వరదాంగజ జనకుని ముంగిట కేగుచు పొంగుచు పరిమళ ॥మం॥ రంగూ బంగారు షాల్ । పొంగు సవరించి హలుమేల్ మంగాసమేతుడైన మంగళ కరునకు మంగళమిదియని ॥మం॥ పక్షీంద్ర రిపుళయనుడే । శ్రీలక్ష్మి వక్షమూన మెరసి । యీక్షితి దాసుల రక్షించినబల్ । రక్ష సజ్జన అసుర శిక్షరెముని । సాక్షిపారక్ష మా వబ్వాందు సం । రక్షించిన, మహారక్షకుడితడు ॥మం॥ కారుణ్య గుణశీలుడే । మనముకోరిన కోర్కెలిచ్చి ఘోర దురితముల దూరముజేసిన॥కా॥ చారూసుందరు చెందం । గోరిమానవులు హరిపురి జేరూజేరుండని భటులు కోరిభజింపుచు గొని పొయ్యేదరట ॥మం॥ మేలైన యెకిలీ పురీ । శ్రీలోలుడు సత్కృపచేతలీల యీ జనులను పాలించును ధర కాలునీమోల దోలగలడు దుష్టమానవుల । కేలూ మోడ్చిన పుణ్యులాను యేలును మరియొక వీలొనరించుక ॥మంగ॥

---

# కీర్తనలు

## ౧. కీర్తన

తారకము సూ ెెరుగవలెనన్న అనుమాదిరి.

ఎంతపాపజాతినేనైతి నరజన్మమెత్తి ॥ఎంత॥ ఎంతోపాపి జాతి జన్మమెత్తితి సిగ్గింతలేక యింతమంచిసొగసు కాలమంతయు విషయాది । దుష్టచింతలాచె పొర్ద్దుగడపితి । బాలుడనై నే కొంతకాలము నాటలాడితి । యౌవనమందు ఇంతులాచె దినము గడపితి । నిమిషంబులక్ష్మికాంతుని సేవించలేనైతి । సంతకూట సంసార సాగరమగ్నుండనేనై మంతనమున రామకృష్ణ మాధవా । యనితలచలేక ॥ఎం॥ పుట్టచెదలు పెంపు పురుగులు వట్టిదేహామే నిశ్చయంబని । అట్టెమిన్ను గానక కన్నట్టి తల్లికడుపుజెరుప బుట్టితినయ్యయ్యో జగతిని । విషయముల సంగతిబట్టి నేవ్యర్థుడ నైతిని । దీపంబుచేతపట్టుకొని నేనూతబడితిని । సద్గురునిపాదము బట్టక తేర్లైపోతిని । పెండ్ల్యందు పుస్తెగట్టిన పెండ్లాముబిడ్డలు పెట్టుమనిబాధించి జుట్టు । బట్టివంచి తన్నగా మొరబెట్టిన ఫల మేమిలేదు ॥ఎం॥ మొర్రిముంత వట్టిచేదుబుర్రి కాయతనువు నమ్మక । సర్రనశ్రీరామకృష్ణుని స్మరణమాని స్త్రీలవెంబడి వెట్టి కుక్కవలెనె తిరిగితి । మాంసంబు కండలు బిఱ్ఱుకుచములుజూచి

భ్రమసితి । పెదవులచొల్లుజుట్టి జుంటితేనె బోల్చితీ । యమునింటి సుఖము విఱ్ఱవీగుచు తెలియలేనైతి । యిప్పాటికైన త్రిగుణములుమాని మనసు దిట్టపరచి కేవలముగ మట్టియాకుమీద బండె కట్టుస్వామిని దలచలేక ॥ఎం॥ దొప్పెడంత నెయ్యిపూర్ణము అప్పడములు కందిపప్పు । దప్పడము పప్పన్నములు దండిచింత పండు మంచి । ఉప్పు యింగురుచులు గొంటినీ । యెవ్వరికి బెట్టక చప్పుడుగాకుండ దింటినీ । దొరకానినాడు అప్పుజేసుక తెచ్చుకుంటిని । పరమేశ్వరునికి మెప్పుగానినడక నడచితినీ ॥ఎం॥ యెప్పుడు బోవునో జీవి యేమి యెరుకలేదుసుమ్మి యిప్పుడే । బోనకంటివెంక । టప్పనే మదిలోనదలచక ॥ఎం॥

## ౨. కీర్తన

పరాకుజేయుట పాటి అనుమాదిరి (భగవన్, కీ)

నాగతి మోమవునొగద శ్రీమాన్ నారాయణదేవా । యేగతి యవునో తెలియదుగద నీకృపసద్గతిత్రోవా ॥నా॥ ఆకలిగొని వకరన్నంబడిగితె ఆటుయిటుపొమ్మందు । లోకులునను భోంచేయ బిలిచితే మేకవలెనేదింమా ॥నా॥ రాకడపోకడ భోగపుస్త్రీలను రమ్మని యనుచుందు । రూకలకైనా మనసులోనబహు వ్యాకుల పడుచుందు ॥నా॥ అన్నములేని దరిద్రులజూచి అపహసించితిడుదు॥ పన్నచోటనే ఉన్న ధనంబును పాతర నేబెడుదు । కన్నులు మిన్నులు గానకనే పరకాంతలపై బడుదు । తన్నుచు పైకం బడుగు వారలకు దండంబులుబెడుదు ॥నా॥ హరికథ జేతామనే

వారినినేనందరి దూషింతు । యెరుక గలిగిన పెద్దలువచ్చితే వొప్పకనిందింతు । దొరకినగవ్వా వారకాంతల దోసిలికర్పింతు । నరక ప్రాప్తికి మూలపు మాటలు నాలుకకర్పింతు ॥నా॥ కుడిచే తెంగిలి మెతుకున కాకినికొట్టని పైనము నా । మిడికెడ నాకరి కలిమిలేములకు మేలనిమదిలోనా । పుడమిలోన సత్పురుషుల ధూషణవిడువను నాలోనా । చెడుప్రవర్తనుల సేవలుమరువక జేసితినిలలోనా ॥నా॥ శంకరవిష్ణుకధలు వినచెవుల సహించను దుర్మతిని । రంకుపురాణము లైతెవిందును రమ్యంబుగ మదినీ । సంకటహరణుండౌ వొనకంటిస్వామిని మరచితిని । వెంకట పతిని గొలువక కాలమువ్యర్థము బుచ్చితిని ॥నా॥

## ౩. కీర్తన

మాయతనువునమ్మ అనుమాదిరి. (యెడ్లరా. కీ)

నరిహరిభజన నోటనరా । వోరిబెరకి జీవుడ నే జెప్పిన మాటవినరా ॥న॥ నోటనరా నోటనరా నోటనకున్నా వినరా ॥న॥ నారాయణుని దివ్యకథలు । వొక్కసారి కర్ణములోన బడినాది మొదలు । దూరముదొలగు పాపములు । గట్టిధీరతో హరిచెంత జేరేరు నరులు ॥న॥ ఇతరులదూషించబోకు । నీవు యితరకాంతలతో పంట్లిగిలించబోకు । ఇతరకొంపలు బుచ్చుకొనకు । నీవు యితర జీవులకైన హింసచేయకు ॥న॥ పలుగాకీమాటలాడకురా । దేహ బలమున్నదని నీవు భ్రమసి మురియకురా । కులమెక్కువని

గర్వించకురా । ధనముగలవాడనని దారిద్రులను దెప్పకురా ॥న॥ అంతమానుమి దుష్టతనము । పాపమెంతజేసిన కాలయముని కేనయము । మంతానముననుంచు భయము । బుద్ధిమంతుడవై ముక్తిమార్గమే గనుము ॥న॥ యెప్పాటికీమేను స్థిరమా । మృత్యు దప్పింప నీ తండ్రితాతల తరమా । ముప్పెన్నటికిబోదు వినుమా । చాలాతిప్పలున్నది సద్గతిప్పుడేగనుమా ॥న॥ హరిదాసు లెవరైన గాని । వారి తెరవుబోయితే నీకు పరలోకహాని । నరకమే ప్రాప్తమయ్యానీ । లెస్సగుర్తించు మదిలో దుర్గుణములు మాని ॥న॥ చుట్టాపక్కాల నమ్మకురా । ద్రవ్యచట్టుంటె వారు నీచుట్టు నిలచెరురా । పెట్టకపోయితె కోపమురా । పుస్తెగట్టిన భార్యైన తిట్టిరోసునురా ॥న॥ పలుమారు బలుక నేటికిరా । కరుణ గలధర్మపురి లక్ష్మికాంతుడే గతిరా । దలచితే మోక్షమిచ్చునురా । శేషచలదాసుమాట నిశ్చయమనుకొనురా ॥న॥

## ౪. కీర్తన

హోహోహో దేహమా అనుమాదిరి. (జ్ఞానమ్ము. కీ)

అహోదేహమా । రవ్వంతలోన దీరెనుసంబంధము ॥ఆ॥ మోహవారధిలో మునిగిమునిగి నీ సాహసమున సద్గతిబాసి తిని ॥ఆ॥ పంచభక్ష్య పరమాన్నంబులు భుజియించి కండలు బెంచి । అవిమంచివనుచు మదినెంచి । బలుమించి నేను గర్వించి । పంచభూతముల సంచయమిదియని యెంచి నే విచారించక పోతిని ॥ఆ॥ పాలు నెయ్యి మీగడ పెరుగన్నము పప్పు పులుసు

శాకాలు । బజ్జీలు గారె వడియాలు । లాడూలు ఫేణి బరిఫీలు । మేలువస్తువులు చాలగనిడి బహు । కాలము నినుపరిపాలన జేసితి ॥ఆ॥ కోరికతో కాశ్మీరు బనారసు గొప్ప శాలుజోడీలు । సొగసైన నిలువుటంగీలు । జల్తారు వన్నె పాగాలు । తీరుతీరు వస్త్రములు నీవు భ్రీమదీర ధరించిన దూరమైతివి ॥ఆ॥ నిండు వేడుకతో పరిమళములుగల పండుటాకు విడియాలు కూర్చుండ కుర్చిపీటాలు । పండుటకు పట్టెమంచాలు । యెండ వాన బడ కుండగాచితి । మండిమండి భస్మంబై పోతివి ॥ఆ॥ మేటిబీబిపుర హాటకాంబరుని నోటస్మరించుట మానీ । ఇదిబూటక మాయసు కొని । కౌటిల్య గుణంబులుమాని । మాటిమాటికిని నోటస్మ రించుట పాటిజేయకను । కాటికిబోతివి ॥ఆహా॥

## ౫. కీర్తన

సీతమనోహరరారా అనుమాదిరి. (జ్ఞానబోధ)

అధమాధముల వేడవలెనా । బహు ఆయాసముల కోర్వ వలెనా ॥అ॥ అదనుగని మీదాసజనములు ముదముగను మీ పదము లెప్పుడు వదలకుండగ భజన జేయగ హృదయమింతయు కరుగదాయను ॥అ॥ చండవిక్రమ భానుతేజా । మకర కుండలా యుత కల్పభూజా ॥చం॥ నిండుశశాబ్ధి తరలను పుండరీక దళాక్ష శ్రీహరి । రెండుదినములు పుడమిలోపల యుండిపోయె టందు కింకా ॥అ॥ అక్షయ కరుణాకటాక్ష । ఘనలక్ష్మణాగ్రజనీరా పేక్ష ॥అ॥ రక్షితామర మోక్షదాయక । యక్షకిన్నర మౌని

సేవిత । వక్షమున శ్రీలక్ష్మియుండగ భిక్షమెత్తించంగ వల దిక ॥అ॥ మతిమీయందుంచియు చాలా । నేనితరుల గొనియాడ జాలా ॥మ॥ పతితపావన నా మనంబున గతియు నీవేయటంచు నమ్మితి । బ్రతికినన్నాండ్లైన నన్నిట భాగ్యవంతుని । జేయ రాదా ॥అ॥ విన్నపమాలించరాదా । సుప్రసన్న రాఘవ నాతో వాదా ॥వి॥ పన్నగాధిపతల్ప మిమ్ముల కన్నతండ్రి యటంచు నమ్మితి । యెన్నిదినములు బ్రతికినను ఈ మన్నులోపల గలసె టందుకే ॥అ॥ వాసవార్చిత నీలవర్ణ । మందహాస సద్గుణముక్తా భరణా ॥వా॥ వాసిగ శ్రీ భద్రిశైలవాసుడగు బ్రహ్మణ్యదాసుని గాచినొందిన ద్రోవవెందుకు కర్మమా ఇది ధర్మమానే ॥అ॥

## ౭. కీర్తన - మద్యపాన విషయమున

నామమె మరువము అనుమాదరి.

లెండు భారతపుత్రులారా । నిదురలేవండోయి మీరు ॥లెం॥ ఇల్లువల్లుగుల్లజేసే కల్లుమానండోయి బాబు కండ్లుతెర వండోయి మీరు ॥లెం॥ కుడువకూడు త్రాగగంజి లేనిబిడ్డల గోడుజూచి । నిలువునీరగు సతినిగాంచి । త్రాగకండి మీరుత్రాగె కల్లువారి రక్తమండి ॥లెం॥ కల్లులొట్టి । సారబట్టి కొల్లగొనె మన మానధనముల । ఇల్లువాకిలి నొకటిజేసి చెల్లబెట్టెను జీవిత ముల ॥లెం॥ త్రాగుబోతుల వ్యసనపరులను । బాగుజేయుచే భాగ్యమున । భారతావని కనుచు తెలిసిన భవ్యపురుషులు । వీర వర్యులు ॥లెండుభారత॥

ఉ॥ తాగ్రిగుడు పాడుగాను నను ధ్వంసముజేసి ధనంబునెల్లయుఁ
లాగి మతిభ్రమంబు కనులారనొనర్చియు కీర్తిఁ దెంచియుఁ
బాగొకటైన లేక ధరపామరునీచును మూర్ఖుఁజేసె నిం
కేగతి నాకు భూమినను నేమనుజుండ నటంచు జెప్పగా॥

ఉ॥ గౌరవ హీనమై సకల కార్యవినాశక హేతుభూతమై
సారవిహీనమై హృదయ సారమునెల్ల గ్రహించి సంపదల్
బారగజేసి భార్య సుత బంధుచయంబులు రోయజేయునీ
సారనుకల్లునుఁ ప్రజ విచారము లేక గ్రహింతురేలకో॥

## ౨. కీర్తన

నిలువదు నిలువదు అనుమాదిరి (జ్ఞానబోధ)

ఇల్లుబుచ్చుకునె కల్లు యీకల్లు కెసరిపడెయిల్లు । కల్లు జేయబట్టిల్లు మునిగెను । తల్లినాలు దిట్టినకల్లు విడువదు ॥ఇ॥ అప్పుదెచ్చి త్రాగుచుండు । అప్పడుగవస్తె దాగుండు । చెప్పుడు మాటలు చెడబడవదరును । చెప్పుతోగొట్టిన తప్పుబట్టడు ॥ఇ॥ బుసబుస బొంగుచువచ్చు । దానితాగ్రిగితే కోపంబెచ్చు । కస బిసవదరుచు । పిసపిస జేయుచు గొనిలో చెడబడ వాసన గొట్టును ॥ఇ॥ తాగ్రిగెదాక గుటగుట త్రాగిన వెనుక లొటలొట । తాగ్రిగినమొదలే తత్వంబెరుగడు । ఈగలు ముసిరిన యిటునటు జోపడు ॥ఇ॥ కల్లలె బహూ బలికించు మరి తల్లినాలి దిట్టించు । తలాపున టొట్టాలాప నెప్పుడు । గులాపుపనులు । చినాలి

తనము ॥ఇ॥ వెర్రికుక్కవలె వార్లు । వానిపిర్రలు మానముతెర్లు । వార్రి వార్రి కండ్లెర్రబడును వాని । పుర్రెలో దిరిగియు సర్రన గర్రికృను ॥ఇ॥చరణం॥ వెంకటయా పల్లంటి వేమారక హరి వేడరంటి । రంకుపురాణము లింకను వినుచును శంకరుని మది సన్నుతిజేయరు ॥ఇ॥

సీ॥ కల్లుదాగిన నీచ • కర్మండు కీచకుం
డల భీమసేనుచే • హతమునొందె
శుక్రునంతటివాడు • సురమీది భ్రాంతిచే
శిష్యహంతకు డయి • చింతనొందె
యాదవులు సురదావి • యా సముద్రముపొంత
కలహించి • నెందరో ఇలమడసిరి
ఇలలోన కొందరు • యీ కల్లుసేవించి
జీవహింసలు యెన్నో • జేయుచుండి

గీ॥ కల్లుదాగెడువారల ఇళ్లలెన్నో
కూలుచున్నవి కూలెను • కూలగలవు
భరతకులపుత్రులార మీ పాదములకు
వందనముజేతు త్రాగుడు • వదలరయ్యా॥

## ౮. కీర్తన

క్యాంనహిదేతో అనుమాదిరి. (బ్రహ్మానంద)

మానజాలము మిముమదిలో మార్కండేయమునివరా । మానక మీ నామస్మరణ మనసుదీర జేసెదాము ॥మా॥ ముందు

మీకు మ్రొక్కెదము మాయందు కరుణనుంచుమా । ఇందుధరుని భక్త మీకు వందనంబిదే నందనం ॥మా॥ వసనహీనులైన జనులు పొసగగను మిమువేడగా । కుశలయాగము జేసి కుమరుల బడసిన మహాత్మవో ॥మా॥ మూడుకన్నుల వానికృపచే కాలు నోడించితిరీ । కీడుమాపై మూడకుండ జూడుమా కృపతో డనూ ॥మా॥ మీదు పౌత్రులమైనమేము మిమ్మెనమ్మి యుందుము। లేదుమాకు యితర చింతలేశ మాత్రంబైనను ॥మా॥ గొప్పదైవ మనుచు మిమ్మునెప్పుడు మదిగోరియు । తప్పక మీ పాదపూజ యెప్పుడుచేసెదమూ ॥మా॥ పద్మశాలి వంశమునకు ప్రభుడవై వెలసినావు । పద్మనాభుని నోట జగద్గురుడని బిరుదందినావూ ॥మా॥ ధారుణి బొంబాయి నగర ధామమందున నిలచియు । కోరువరము లిచ్చి భక్తుల కూరిమి నేలితిరి ॥మా॥

## ౯. కీర్తన

దాడోదాడోజీమహా అనుమాదిరి.

కరుణజూడుము మా పైనివేగ । కలుషహరణ మార్గం దేయబాగ ॥క॥ కోరికోరిమిమ్మె నమ్మినాము । కోపమేల మా చెంతకుజేరుము ॥క॥ నిష్టనీపైని నిలిపినాము । మా కష్టము లను కడనుద్రోయుము । శ్రేష్టపురుష నిన్నే సేవించెదాము । మా యిష్టవేల్పని నమ్మినాము ॥క॥ శశిశేఖర ప్రియభక్తమమ్ము। గాసిదీర్చియు కరుణించ రమ్ము । పసివారము నుతియుంచెదాము । నీ శిశువులను గావరమ్ము ॥క॥ మేటి బొంబాయి పురమునను నిలిచి।

పాటిగను నీదు వంశజుల। జూచి నేటికైన నీకృప యుంచదలచి। యిచ్చోటి కేతెంచు దయదలచి ॥కరు॥

## ౧౦. కీర్తన

కన్నులకు కనరాడె అనుమాదిరి.

భావమున నమ్మినామురా భావనాఋషివర నిను ॥భా॥ సావధానముగను నీదు చరణసేవ జేయుదుము పావనుల జేయ వేమిరా ॥భా॥ హరిహరుల కరుణచేత పరగవస్త్ర కల్పనంబు। త్వరితముగ జేసినావని ॥భా॥ సురమునులకెల్లను బల్ సొగసు మీర వస్త్రములను । పరగనిచ్చిన పాత్రిజ్ఞుడవని ॥భా॥ భూత నాథుని కోర్కెదీర్ప ప్రీతితో పులిచర్మములను నీతివంత నొసగి నావని ॥భా॥ పద్మమిత్రు డుండువరకు । పద్మశాలి యనెడు బిరుదు । పద్మాక్షుచేత బొందితివని ॥భా॥ జలజాప్తునిపుత్రికను । జేకొనియు సురలచేత । బహు పెంపుబడసినావని ॥భా॥ అసురుడైన కాలువసేను । వసనవృష్టి జెరచివాని । నశియింప జేసినావని ॥భా॥ శ్రీధరుని వ్రతము జేసి । సుతులను సూర్గు రునిగని మోదమందిన మాన్యుడవని ॥భా॥ కులశీల గుణములు నీ కొమరులకును గలుగజేసి । ఇలనుకీర్తి నిలిపినావని ॥భా॥ భాసుర గోవిందుపేటలో భాసిల్లుచుండి జనుల। వాసిమీర గాచి నావని ॥భావ॥

## ౧౧. కీర్తన

యెన్నిమాయలు జేసినాడమ్మ అనుమాదిరి. (యెల్లరామ)

లుబ్ధమత పాషాణదుర్బుద్ధీ । ధనముండిన ప్రారబ్ధమేమిరా పాపమభివృద్ధి । శబ్దశాస్త్రజ్ఞాన కవిత సద్బోధకులగు సాధు జనుల । శబ్దమినగనె శాన మర్కట సముడనై బెదరించె దవు ఛీ ॥లు॥౧॥ దండుగంటె బెట్టుచుందువురా ధర్మంబునకు నీ గుండెగదులదు చింతనొందెవురా । దండీవాడవా మొండి వాడవా లంచువాడవా కానిఛీఛీ । మొండికూతలెగాని యాస్తవ పండితోత్తము వైతెగావు ॥లు॥౨॥ దుడ్డుగలిగిన వాడవైతేమి । బల్ దారిద్రుడవె గొడ్డువనితల సుతుల పేరేమి । సుద్దితన మెందుకురా నీకిది మంచితనమా పుణ్యసభలో చెడ్డతనము చేటురా నీ దొడ్డతన మిందేమిగలదు ॥లు॥౩॥ లేనిమాట పల్కుచుండె వురా । ధనమార్జనకై కాని పనులు జేయుచుందువురా । మాను మిట్టి లోభితనము । మానసంబున పూనుధర్మము తానుతినుచు దాన మొసగుచు దీనపోషణ జేయమేలగు ॥లు॥౪॥ పాపముననె పెరగునీధనమూ । కటికటీగతెట్టెకు శాపమున్న దెరుగవా ఘనము । పాపములనె పెరిగి నీ ధనం పాపమునకె వ్రయంబై సం । తాప మొందగ జేసి రౌరవకూపమున బడవేయురా నిజ ॥లు॥౫॥ రామసింహాకవి ప్రబోధలకె । నీ మతంబిడువవు మిడికేదవుర యముని బాధలకే । ఏమిగావను యేమిగాకను యేమిలేకను । యేమిబోకను యముడు బట్టిన పిమ్మట నిన్నెవరు యడుగరు ఘోర పామరా ॥లు॥

## ౧౨. మహారాష్ట్రి గీతము

శ్రీ జగదీశ మేలుకొనుము - అనుమాదిరి.

కసిరాష్ట్రిచీ థైనజాలిభూపాలా । కై వానికోనివురలా జగిరై తేలకోనినా ఆశ్రియధాతా । జథకరిదావభగవంత ॥కసి॥ మోరమాధావ గణరాయ । సంకట విగ్నతాలాయ । జథకరి ప్రగటప్రభూరాయ । నుతగౌరిహర తారిఅతారాష్ట్రిలకై వారిన కోనివురలా ॥కసి॥ గరిబాంచిదశా బహుబికట । బిక్షయిమి లేనసీట। నిద్రేసగోంగడినకాఠ । కసియెయినాచే తుఝాకరుణజగపాల ॥కసి॥ శ్రీమంతమౌజ ఉడపీతి । ధర్మాచే నావనగేతి । కాంచనీసదౌలతి బారతి । అవిచారాచాపర్వత ఆ కోసలలా ॥కసి॥ జగి అసంఖ్య గోవధజాల । జరిమనిజుల్మబహుకేలా । మోక్షచే శబ్దనాఉరలా । శ్రీఛ్రతపతీతారిఅతా రాష్ట్రిల ॥కసి॥ ఏసాజీమణిఅంబేలా । లాగ లిఘ్రాణరాష్ట్రిల । ధర్మాచనావబుడాల । శ్రీజగదాంబేపావె అంబెనౌసాల ॥కసి॥

## ౧౩. పాట

యిదినీకు విహితమౌనా అనుమాదిరి. (ధర్మపురి. రా)

శ్రీరఘుపతిని గొల్వవే వోమనసా స్థిరబుద్ధితో నుండవే । శ్రీరఘుపతిని గొలిచితే ఘోరపాపములు దూరమైపోవు యమ బాధ గల్గదునీకు ॥శ్రీల॥ యిల్లుముంగిల గట్టుకా । నీ మనసున యిది బాగతలపెట్టుకా । పెండ్లాము బిడ్డలకు పెట్టిపెట్టి తుదకు.

తండ్లాడిచచ్చెదవు దైవంబుమెచ్చదు ॥శ్రీర॥ నీ వెంత జతగూర్చిన । నొకప్పైనైన నీ వెంటరావచ్చునా । భావమందున యిట్టి భ్రమలెల్ల మానియు కావునాసద్గతి గనుబోధదెలుసుకో ॥శ్రీర॥ దసలిపొగును గూర్చుకా । తనయింటి ద్వారంబు తాబన్నుకా । పిసిరికాయల పురుగు మెసులజాలక తుదకు । ఉసురోయనిచచ్చు ఉపముతా గానకా ॥శ్రీర॥ సాకేతపురవాసునీ పొనుకంటిస్వామి । శ్రీరఘు రామునీ । యేకముచిత్తముతోడ యెలమిధ్యానించిన । నీకోర్కె ఫలియించు నిశ్చయంబుగాను ॥శ్రీర॥

## ౧౪. కీర్తన

ఆనందభైరవి రాగం—చాపుతాళం.

వద్దురా జన్మం వద్దురా (జ్ఞానామృతం)

దక్కునూ మోక్షము దక్కును । సన్మార్గజనులకు దక్కునూ మోక్షము దక్కును ॥ద॥ దక్కునూ గురువాక్య పద్ధతి యెక్కువనుచును నమ్మి సతతము । నిక్కుచుండెడి భ్రమను మీరి చక్కగను వర్తించువారికి ॥దక్కు॥ కామ వర్గాములను గెలచి నేమముతో శ్రీగురుపదంబులు । వేమరూ సేవింపుచుండిన కామజనకుని కరుణచేతను ॥దక్కు॥ తల్లిదండ్రి గురులపోషణ నెల్లకాలము చేయుచున్నది । కల్లలేకను భూతదయ నెగజల్లు వారికి శాశ్వితంబుగ ॥దక్కు॥ రాముడే శ్రీగురువరుండని ధీమ నంబున గుర్తునిల్పి । సామగాన విలోలులైహరి నామస్మరణను జేయువారికీ ॥దక్కు॥ మారహరుడగు చంద్రిమౌళిని కోరికతో

పూజించి కర్పూర । హారతులు సద్భక్తిమీరగ నేర్పుతోడుత నొసగువారికి ॥దక్కు॥ వాదభేదము మాని మనసున మోదఖేదము జెందనివ్వక । సాధుజనులకు సేవసల్పుచు వేదశాస్త్రము జదువు చుండిన ॥దక్కు॥ మూడు మూర్తుల మూలమెరిగి మూడుగుణ ముల విడచి ఘనమగు । మూడుభ్రాంతుల జోలిమదిదిగనాడి సత్యము మానకుండిన ॥దక్కు॥ పొంకముగ పిల్లానవంశజ శంక రార్యుని కరుణవడసిన । వేంకటేశ్వరదాసు కృతివిన సంకటంబులు దీరి నిజముగ ॥దక్కు॥

## ౧౫. కీర్తన

ఆనందభైరవి రాగం—చాపుతాళం.

వద్దురా జన్మం వద్దురా (జ్ఞానామృతం)

తప్పదూ నరకము దప్పదు । దుర్మార్గ జనులకు । తప్పదూ నరకము దప్పదు ॥త॥ తప్పదూ గురువాజ్ఞ ధరలో తప్పితిరిగెడి దొంగభక్తుల । గప్పుకొని తద్దోషమెపుడు గొప్పతిప్పల బెట్టు నిజముగ ॥త॥ సగుణ రూపుడైనగురుడే జగములోపల దేవు డగునని । నిగమవాక్యము దెలియనేరని పొగరుబోతులైన నరులకు ॥త॥ ఆలుపిల్లలు ధనము మిధ్యని కీలుదెలిపెటి దేశి కేంద్రుని । పాలబడి దశఇంద్రియంబుల జోలివిడువని పామరు లకు ॥త॥ రామనామము భజనసేయక సోమశేఖరు పూజమనుచు । కామజనకుని మాయలోబడి ధీమసంబున దిరుగువారికి ॥త॥ వేద శాస్త్ర రహస్య మెరుగక సాధుజనులను నిందసేయుచు । రాదు

మోక్షము దుర్ఘటంబని వాదనలు జేసేటివారికి ॥త॥ పెద్దలను పెరు మాళ్ళ గనుగొని వొద్దికతో సన్నుతులు సేయక । బుద్ధిహీనత చేతవారిని రద్దిజేసే దుష్టజనులకు ॥త॥ పీలుఖానా శంకరార్యుడు మేలుగా దయజేసుబోధను పాలుమాలివిడుచు మూర్ఖుల పాలబడు యమలోకపదవి ॥త॥ పొంకముగ ధరణీతలంబున వేంకటేశ్వర దాసుజెప్పిన । శంకరహితంబైన కృతులకు వంకలిడు దుష్కలుష విధులకు ॥తప్పదూ॥

## ౧౬. కీర్తన

వుండబోదీ దేహాము । మనసందు శ్రీహరి నుంచుకొనుము సహాయము ॥ వుండదు యీ లండు జన్మము పండువలె పడిపోతదెన్నడో పుండరీ కాక్షుని వాక్కుపూట । నోటితో దల్వవైతివి ॥వుం॥ యెండవానల కోర్వదు । కాయాము పచ్చికుండ రీతినిల్వాదు । తిండితెప్పగ తినుచు । మురికికండ బెంచుక గానవొరుల । దండధరుని శాంతకొనువు కుండదలచెటి । లండుజన్మము ॥వుం॥ బొర్రి పిర్రిలు బెంచుకొని । విఱ్ఱవీగుచు మురియబోకు । నిర్రసీల్గిన వెనుక నీవాక తొర్రిగవ్వకు పనికిరావు ॥వుం॥ చక్కనిదియని మురియకు । ఇది నీకు స్వంత హక్కు । సొమ్మని బలుకకు । దక్కనేర దటంచు బలికిన । నిక్కపడును పెద్ద వెర్రి । కుక్కవలె దిరుగెదవు । శ్రీహరి దిక్కునీకని నమ్ముకోరా ॥వుండ॥

## ౧౭. ష రా బి కి గా న

ఆకోమెనశా దిల్‌మెజలజా దర్ధ్‌హైసర్మే । ఉర్‌జాగ్ శరాభీకెలగీ అగ్‌హై ఘర్‌మే। సోచో యహీ మజామే ॥ఉ॥

కపడోంకొహై మోతాజ్‌తెర చాహనేవాలే । ఔర్ అంత్‌కో తర్‌సాతేహై, తెరే నాశ్ కొపాలే।జబ్‌తూహి న సమ్‌ఝొతో తుఝె కౌజాసంభాలే । జిస్మేనతు పీతాహోపియా లోపెపియాలో ఐసీతోపేర్ ఏకునహి హత్‌వర్‌మే ॥ఉ॥

రోతాహైతెరీ లాశ్‌పె హస్‌హస్‌కె సముందర్, ఔర్ తేరి ఉచ్చదకులసె శర్‌మాతేహై బందర్, పీ పీకెతుజాతాహై ఉజా అస్తాన్‌కెఅందర్।ఇత్ నాహిన, సమ్‌జాతనహి మస్జిద్‌హై య మందిర్, హైమజా మోహల్లోమెన ఇజ్జత్‌హై నగర్‌మే ॥ఉ॥

తూనె బడేబుడోంకి కభీబాత్‌న మాని, బోలాతో యహ బోలామేరి ఆదత్‌హై పురాని, శర్‌మింద్‌హై బూడోసె శరాభీకె జవాని, పీ పీకె షరాభీక్ లహు హోగయాపాని, రుక్‌తీహైకభి సాన్‌కభి దర్దుజిగర్‌మే ॥ఉ॥

జిజాకామ్‌సె కుఛ్‌మిల్‌తాథావో కామ్‌భిఖోయా । అప్నాహి నహి బచ్చోంకా అరాంబిఖోయా, శోభాభిగయి భాన్‌గయి నాంభిఖోయా మెహనత్ సెజోకమాయాథావా దామ్‌భీఖోయా, సభిఖోకర్ బురాబజాగయా దునియాకె సఫర్‌మే ॥ఉ॥

## ౧౮. మ ద్య పా న ని షే ధ ము

వినంతితిఏక్ తుమ్హాల కిసోడదారుచ్య ప్యాలా, దారునే విశ్వమోహిలె జగాచనాశహోకేలా ధరిలెఆజ అమ్హాల ఘాతలా మృత్యుచాఘాలా కుటుంబే నాహిశికేలా, మిళేన అన్నఖా యాలా, కశీహో లాజరక్షిపీ మిళేన వస్త్రల్యాయాలా మానిత లోక నాకోణి అసహ్యే దారుబాజాలా ॥వి॥

మిళాలే ద్రవ్యకష్ట్యాచే ఖర్చితో దారుచ్యావాటే కుఠేహో శుద్ధదేహాచి, గటారీ జాతిఝోకాటె బుద్ధిచీ । రాఖ్ రాంగోళి, ముఖానె దేశివిగాలి । రాహిలిశక్తిన దేహిజనాసి కరితెబందాలి । శిపాయి దేయిదండాలా, ఠోకితో బేడిహాతాలా హాసతిహో లోక బాజూచే, అసాహ్యేదారు బాజాలా ॥విసు॥

కంఠితో రాత్రకాళోఖి, జగాంచ్యా కోఠడిమాజీ వుతరలీ దారుచీధుందీ, శివ్యాదే ఆపఆపణాలా అరవి బాయకాపోరె, ఘరిజీఘాయి హెరడతీ ఉఠోనివిసపీ పోలీసాలా, ఏకధామా పధ్యామజలా పారతేనాహి కాకుళతీ, కేచీతో న్యాయకోర్టాలా కైద్‌తి అఠదివసాంచి, సాంగతో కోర్టశిక్షాల ॥వి॥

మజూరి అఠదివసాంచి, లాగలీ తూటపైశాలా । మాగతో బాంధవాపాశీ, కోణినాదేవుధారీలా వాటతే లాజలోకాంచి, మణో నిలఫవి తోండాలా అబ్రుతీ రాహిలీకుఠె, బంధునో ఉగడాహో ధోశే । మనాశిగా ఠహిబాందా, ఘాతహో దారునే కేలా బంధునో శపథహోఘోలా, శివున అమ్కి దారులా ॥వి॥



# 19. అష్టకములు

రవిసుధాకర వహ్నిలోచని రక్తకుండల భూషిణీ । ప్రవిమలంబుగ మమ్మునేలిన భక్తజన చింతామణీ । అవని జనులకు గొంగు బంగారైన దైవశిఖామణీ । శివుని పట్టపురాణి గుణమణి శ్రీగిరీ భ్రమరాంబికా.

2. కలియుగంబున మానవులకును గల్పతరువై యుండవే । వెలయు శ్రీగిరి శిఖరమందున విభవమై విలసిల్లవే । అవనిలోపల భక్తవర్యుల కష్టసంపద లీయవే । జిలుకు కుంకుమ కాంతిరేఖల శ్రీగిరీ భ్రమరాంబికా॥

3. అంగవంగ కళింగభూముల నాంధ్రదేశము లందునన్ । పొంగుచును వరహాట కొంకణ పుణ్యభూముల యందునన్ । రంగుగా గర్ణాట లాట మరాటసీమల యందునన్ । శృంగిణీ దేశములవెలసిన శ్రీగిరీ భ్రమరాంబికా॥

4. అక్షయంబుగ కాశిలోపల నన్నపూర్ణ భవానివై । సాక్షి గణపతి కన్నతల్లిరో సద్గుణాకర శాంభవీ । మోక్షమొసగెడి కనకదుర్గవు మూలకారణ శక్తివీ । శిక్షజేయుదు ఘోరభవముల శ్రీగిరీ భ్రమరాంబికా॥

5. వెల్లివిరిసెను నీ ప్రభావము విష్ణులోకము నందునన్ । పల్లవించెను నీదుభావము బ్రహ్మలోకము నందునన్ । మొల్లముగఁ గైలాసమందును మూడులోకము లందునన్ । చెల్లునమ్మా లోకపావని శ్రీగిరీ భ్రమరాంబికా॥

6. భూతనాధుని వామభాగము పొందుగా జేకొంటివీ । ఖ్యాతమా శ్రీశైలమందున ఖ్యాతులిల గైకొంటివీ । పాతకంబుల బాఱద్రోలుచు భక్తులను నెలకొంటివీ । శ్వేతగిరిపై నుండి వెలసిన శ్రీగిరీ భ్రమరాంబికా॥

7. సోమశేఖరి పల్లవాధరి సుందరీమణి ధీమణీ । కోమలాంగి కృపాపయోనిధి కుటిలకుంతల యోగినీ । నామనంబున బాయకుండెడు నగకులేశుని నందనీ । సీమలోపల వినుతి కెక్కిన శ్రీగిరీ భ్రమరాంబికా॥

8. తరుణి శ్రీగిరి మల్లికార్జున దైవతేశుని భామినీ । కరుణతో మమ్మేలుకొంటివి కల్పవృక్షము భంగినీ । వరుసతో నీ యష్టకంబును వ్రాసిచదివిన వారికిఁ । సిరులనీయవె యెల్ల కాలము శ్రీగిరీ భ్రమరాంబికా॥

శ్లో॥ ఆదౌదేవకిదేవి గర్భజననం । గోపీగృహే వర్ధనం మాయా పూతన జీవితాపహరణం । గోవర్ధ నోద్ధారణం । కంసచ్ఛేదన కౌరవాది హననం । కౌంతేయ సంరక్షణం । ఏతద్భాగవతం పురాణ ఘటితం । శ్రీకృష్ణ లీలామృతం॥

శ్లో॥ ఆదౌరామ తపోవనాది గమనం । హత్వామృగం కాంచనం । వైదేహీ హరణం జటాయు మరణం సుగ్రీవ సంభాషణం । వాలిప్రాణ విమోచనాబ్ధి తరణం । లంకాపురీ దాహనం । పశ్చాద్రావణ కుంభకర్ణ హననం ఏతద్ది రామాయణం॥



# 20. మంగళాష్టకములు

1. స్వస్తిశ్రీ గణనాయకం గజముఖం మోరేశ్వరం। సిద్ధిదం బల్లాళం మురుడం వినాయకమడం చింతామణి ధేవరం లేణ్యాద్రిం గిరిజాత్మజం సువరదం విఘ్నేశ్వరం ఓఝరం గ్రామేరాం జణనాయకే గణపతిః కుర్యాత్ సదా మంగళమ్॥

2. గంగాసింధు సరస్వతీ చ, యమునా గోదావరీ నర్మదా। కావేరీ శరయు మహేంద్రతనయా చర్మణ్వతీవేదికా । క్షిప్రా వేత్రవతీ మహాసురనదీ ఖ్యాతాచయా గండకీపూర్ణః పూతజలైః సముద్రసహితాః కుర్వంతు సదా మంగళమ్॥

3. యంబ్రహ్మ వరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైర్వేదైః సాంగ పదక్రమోప నిషదై ర్గాయన్తియం సామగాః । ధ్యానావస్థిత తద్గతేనమనసా పశ్యన్తియం యోగినోయ స్యాంతం నవిదుః సురాసుర గణా దేవాయ తస్మైనమః॥

4. యాకుందేందు తుషారహారధవళా యా శుభ్రవస్త్రా న్వితా । యా వీణావరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా। యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి భిర్దేవై సదా వందితా సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥

5. కస్తూరితిలకే, లలాట ఫటలే వక్షఃస్థలే కౌస్తుభా।నాసాగ్రే నవ మౌక్తికం కరతలే వేణుః కరే కంకణమ్ । సర్వాంగే హరి చందనం సులలితం కంఠేచముక్తావళీ । గోపస్త్రీ పరివేష్ఠితో విజయతే గోపాల చూడామణీ॥

6. లక్ష్మి కౌస్తుభ పారిజాతకసురా ధన్వంతరి శ్చంద్రమా। గావః కామదుధాః సురేశ్వర గజోరంభాది దేవాంగనా । అశ్వః సప్తముఖోవిషం హరిధనుః శంఖోమృతం చాంబుధే। రత్నానీహ చతుర్దశ ప్రతిదినం కుర్వంతు వోమంగళమ్॥

7. కంఠేయస్య విరాజతేహిగగరళం శీర్షేచ మందాకినీ। వామాంకేగిరి జాసనం కటితటే శార్దూల చర్మాంబరమ్। మాయా జస్య రుణద్వి విశ్వమఖిలం తస్మైనమః శంభవే। సస్థాణుః స్థిర భక్తి యోగ సులభః కుర్యాత్సదా మంగళమ్॥

8 బ్రహ్మాద్యాసనకాదయః సురగణః సభావ్రజిణో। భారద్వాజ పరాశరాదిమునయః సంస్తూయ మానాసదా। విశ్వా మిత్రి పురోగమా మునిగణాః పౌరాణికా యాజ్ఞికా। భోక్తారో నిగమాగమార్థ నిపుణాః కుర్వంతు వోమంగళమ్॥

9. లక్ష్మీశో భువనత్రయే నిగదితో దేవాన్మనుష్యోరగాన్। సంస్థాతుంకరుణానిధిః కరుణయా మార్తండ వంశేయయౌ। సంకల్పే నిజగర్భ సంభవకృతే జన్మస్య సాధారణే। జాతః శ్రీరఘునాయకస్య జననం కుర్యాత్సదా మంగళమ్॥

10. నాగోభాతి మదేన కంజలరుహైః పూర్ణేందు నాశ ర్వరీ। శీలేన ప్రమదా జలేన తురగో నిత్యోత్సవై ర్మందిరమ్। వాణీ వ్యాకరణేన హంస మిథునైర్నద్యః సభా పండితైః। సత్పు త్రిణకులం నృపేణ వసుధా కుర్వాత్ సదామంగళమ్॥

11. నత్వాన్వాం కులదేవతాంచ కమలాం విఘ్నేశ్వరం శారదాం। వక్షే కృష్ణవివాహ కౌతుకమిదం చేతోహరంశ్రూన్వతాం। స్వాన్త్యైవాణ్య గుణానువర్ణన పరిశ్రాంతస్య విశ్రాంతయే। నిత్యం సాధర పూర్థయె కుహకవత్ కుర్యత్ సదామంగళం॥

12. ఏతాః శ్రీకులదేవతా మునివర ఏతేవంష్టారతో। నేతారః ఖలురాష్ట్రి కార్యకుశలవి తేస్వధర్మోసుఖాః। ఏషాధన్య తమ సుపుత్రిజననీ వంద్యార్యభూః పావనీ। కాలీశ్రీశ్య సరస్వ తీచ సతతం కుర్యత్ సదామంగళం॥

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# 21. ఢంకా

## ( దురాచారులకు మోక్షమున్న )

వ్యాసకర్త: గుంటక నరసయ్య పంతులు

ఈ వ్యాసము చాలమంది మిత్రుల ప్రోత్సాహమున వ్రాయబడినది. ఇప్పటి ప్రపంచమునందు కొన్ని చోటులలో గురుబోధ, అచలబోధ, శుక్రవారపుపూజ, రహస్యము యను పేర్లచే చాల దురాచారములు జరుగుచున్నవి. ఈ ప్రసంగము లందు మధుమాంససేవలు చాలపవిత్రములుగా భావించు చున్నారు. ఇవి ముట్టని కులజులుగూడ యిటువంటి ప్రదేశములో ముట్టడము పవిత్రముగా భావించు చున్నారు. కాబట్టి పవిత్ర హృదయులగు కొందరు మిత్రులు "మోక్షమను పేర జరిగించు చున్న యీ ఆచారములు సరియైనవేనా?" అని ప్రశ్నించు చున్నారు.

మానవ లోకమునకు మోక్షమార్గము చూపించినవారు పూర్వపు ఋషులు. అందు నాకు దెలిసినవఱకు వ్యాసమహర్షి

కణ్వ, గౌతమ, కపిల, పతంజలి, జైమిని, శుక, వసిష్ఠ, జనక, నారద, మార్కండేయ, భీష్మ, కృష్ణభగవాన్, ఆ తర్వాత బౌద్ధ, శంకర, రామానుజ, మధ్వ, చైతన్య, విద్యారణ్య, సమర్థ రామదాసస్వామి, జ్ఞానదేవులు, కబీరు, నానక్, నిశ్చల దాసు, ఇటీవల వేమన్న, శివరామదీక్షితులు, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, మహాత్మ గాంధి, అరవిందఘోష యిత్యాది మహాపురుషులు.

వీరందరు "మానవుడు సంసారమందుండి, మిగుల దీక్షతో కర్తవ్యమును నెరవేర్చి, కడకు మోక్షము సాధించు కొనడమే పరమపురుషార్థము" అని బోధించి యున్నారు. ఆ మోక్ష సాధనకు అహింసా, సత్యము, శుచి, ధైర్యము, నీతి, నియమము, సదాచారము, ఇందిర్రియనిగ్రహము, వివేకము, భగవద్భక్తి, ఆత్మసంయమము, ముఖ్యములని విధించి యున్నారు. మొత్తముమీద వీఅందరి యభిప్రాయము యీ దిగువ కనబరచిన నాల్గింటిలో నొకటియై యుండును

౧. సత్క్రియాచరణము. ౨. భక్తి.

౩. యోగాభ్యాసము. ౪. తత్వవిచారణ.

మొత్తముమీద అన్ని మతములసారమును, మోక్షము యొక్క రహస్యమును యీ నాల్గింటిలో నిమిడియున్నది.

ఈ నాల్గింటిలో నేదియైన నొకటి ద్వారమోక్షమును సాధించవచ్చును. ఇట్లని పైన దెలిపిన వారియందరి అభిప్రాయమై యున్నది. వారిప్పుడు లేక పోయినను వారు వ్రాసిన పుస్తకములు మన యెదుటనున్నవి. మనము చదివి చదివించుకొని తెలిసికొనవచ్చును.

ఇక నీ మోక్షమార్గమును సాధించె అధికారి శమ, దమ, ఉపరతి, ముముక్షత్వములు గలవాడు. "శమ" మన బహిరింద్రియ నిగ్రహము. "దమ" మన అంతరింద్రియ నిగ్రహము. "ఉపరతి" యన సర్వకామము లుడుగుట. "మముక్షత్వ" మన యీ లోకచింతన మేమాత్రములేక కేవల మోక్ష చింతనమే కలిగి యుండుట. ఈ లక్షణములు గలవాడు మాత్రమే మోక్షము సాధించుటకు యోగ్యుడు, అధికారి. ఇవిలేక, పైన దెలిపిన నాలుగు మార్గములలో నేదియైన నొకటిద్వారా గాక, ఆ పైన దెలిపిన సద్గుణములు లేక "మోక్షము" ఎన్ని జన్మలకైన లభింపదని మహాపురుషులు "ఢంక" గొట్టి చెప్పియున్నారు.

మరియు నీ మోక్షమార్గమును బోధించు అధికారి సంపూర్ణ శాస్త్రజ్ఞాన ఆత్మజ్ఞానము గలవాడు. ఉత్తమమైన సద్వర్తనము, స్వచ్ఛమైన సదాచరణము, నిర్మలమైన పవిత్రభావన, పతితోద్ధారప్రేమ, దీనజన వాత్సల్యము గలిగి, శుద్ధ సత్వగుణ

సంపన్నులై ప్రకాశించువారు సద్గురువులు. ఇట్టి మహానుభావులు మోక్షజ్ఞానోపదేశము చేయుటకు అధికారులు, యోగ్యులు. ఈ లక్షణములలో నేదియొకటి లేకున్నను అతడెన్నటికిని శిష్యుని సద్గతి నొందింపజాలడు. అతనికి జ్ఞానోపదేశముచేయ నధికారము లేదని మహాపురుషులు "ఢంక" గొట్టి చెప్పినారు.

"శిష్యునియొక్క మనోనిగ్రహము గావించి, ఇంద్రియ దమనము గావించజాలని గురువులు గవ్వకు ముగ్గురు దొరికిన వలదు" అని సమర్థ రామదాసస్వామి చెప్పియున్నారు. ఇట్లే పైన దెలిపినవారందరి యభిప్రాయమునై యున్నది.

మరియునే నీ విషయమై పుస్తకములను చూచి తెలిసి కొన్నదేగాక సద్గురువులు శ్రీ మలయాళస్వాములవారిని గూడ అడిగి తెలుసుకొంటిని. వారుగూడ పైన దెలిపిన విధముననే దెలిపిరి. వారు తిరుపతి సమీపమున "శ్రీవ్యాసాశ్రమ" మను పేర నొక యాశ్రమము స్థాపించి, సంస్కృత పాఠశాలలను, యోగాభ్యాస, తత్వాభ్యాస శాలలను యేర్పరచి, పూర్వకాలపు గురుకుల ఆశ్రమమువలె తమ ఆశ్రమమును నడిపించు చున్నారు. మానవులకు బ్రహ్మజ్ఞానమును, మరి యితర ప్రపంచజ్ఞానమును సులభముగ దెలియుటకై వారు అనేక పుస్తకములను వ్రాసి యున్నారు. అందు ఈ విషయమున "శుష్కవేదాంత తమో భాస్కరము" చదువదగినది.

బన ఈ కాలపు గురుశిష్యుల విషయమున కొద్దిగ వ్రాసెదను. ఈ కాలమున "మోక్షము" అంటె అది ఒక ఆట వస్తువైనది. అది ఒక వ్యాపారమై పోయినది. ఎటువంటివాడు గురువో, యెటువంటివాడు శిష్యుడో, ముఖము గడుగ లేనివాడు, ప్రపంచము దెలియనివాడు, భార్యాబిడ్డల గాపాడలేనివాడు, తల్లిదండ్రులకు అన్నము బెట్టనివాడు, ఆచార విచారములు దెలియనివాడు, అవివేకి, కర్తవ్య హీనుడు, దుర్మార్గుడు, అధర్మి, అందరికి మోక్షమో! వీరందరు మోక్షాధికారులే. పరులను దోచుకొనడము మోక్షమే! పాపకృత్యములు మోక్షమే! పరుల భార్యలను, సొమ్మును అపహరించడము మోక్షమే! కపటకృత్యములు మోక్షమే! కల్లు, గంజాయి, సొల్లు త్రాగడము మోక్షమే! అంతా మోక్షమే!! ఇది మోక్షాలపంట!!!

ఈ మోక్షాలపంట పండించేవారు యీ కాలపు దొంగ గురువులు. ఈ గురువు లెటువంటివారంటె నిరక్షర కుక్షులు, అనాచారులు, దురాచారదాసులు, కడుపునిండా కల్లుద్రాగువారు, గంజాయి ద్రాగితె మరీగొప్పవారు. మాంసభక్షకులైతె మర్రీ పూజ్యులు. ఒకడు పరునిభార్య నపహరించినవాడు. ఒకడు శిష్యుని భార్య నపహరించినవాడు. ఒకడు పార్వతిని (జన్నెకిడిచిన దానిని) గట్టుకొన్నవాడు. ఒకడు దాసిని అంట గట్టుకొన్నవాడు. ఒకడు తిట్టి, ఒకడు మొట్టి, ఒకడు మొండి, ఒకడు పాషండి. ఒకడు శుంతుడు, ఒకడు నాస్తికుడు-వీరంతా గురువులు. ఈ కాలపు మోక్షాలపంట పండించేవారు వీరు. ఈ మోక్షాలపంటను వీరు

ఊరూరతిరిగి బోధామృతము, తత్వపత్రికాశికలు, జ్ఞానబోధనల ద్వారా అమ్ముకొను చున్నారు. ఏమీ తెలియని అమాయకపు జనులు యీ కపట వ్యాపారములో జిక్కి దుర్గతి పాలగుచున్నారు. ప్రపంచములో నెందరో యీబోధలవలన అధోగతి నందుచున్నారు. ఎందరో నీ బోధలవలన ధర్మభ్రష్టులు, మానహీనులు, బుద్ధి భ్రష్టులు నగుచున్నారు. కొందరు సంసారము బోగొట్టుకొను చున్నారు. కొందరు ఆలుపిల్లలను దుర్గతిపాలు చేయుచున్నారు. కొందరు తల్లిదండ్రులను దుఃఖములో ముంచుచున్నారు. కొందరు ఇతర గృహస్థులకు ఉపద్రవము కలిగించుచున్నారు. కొందరు తమకుతామే చెరుపుకొని వెఱ్ఱులై తిరుగుచున్నారు. ఈ విధ ముగ నీ దొంగవేదాంతము ప్రబలి మానవులపాలిటి కొక మహా రోగముగా పరిణమించినది. గాన బుద్ధిమంతులైనవారు యిది యంత తమ దివ్యచిత్తమునకుదెచ్చి నీ రోగము నంటకుండ నుందురుగాక యని తలంచి యీ లేఖ వ్రాయనైనది.

సుహృదయులైన యాత్మబాంధవులారా ! తామెల్లరు యిందు దెలుపబడిన విషయములను మనఃపూర్వకముగా నాలోచించెదరుగాక యని నమ్ముచున్నాను. తమకు విరోధ ముగానున్న మాత్రముననే నిరసించ గూడదనియు, సత్యా సత్యములను పరిశీలించి నిర్ణయించ వలసినదిగా గోరుచు ముగించు చున్నాను. నిజానిజములను విచారించక గినిసికొనిన లాభముండదు,

ఉద్ధరేదాత్మనాఽత్మానం నాఽఽత్మానమవసాదయేత్ ।
ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః॥

(భగవద్గీత అ. ౬-శ్లో. ౫.)

తా॥ ఆత్మచే మనుషుడాత్మ నుద్ధరించుకొననగును
దానినధోగతికి ద్రోయరాదు
ఆత్మయే యాత్మకు బంధువు
మరియు నాత్మయే యాత్మకుశత్రువు.

ఈ విధముగ "ఢంక" గొట్టి ఆత్మీయులైన సోదరులను హెచ్చరించు చున్నాము. "ఉత్తిష్ఠః జాగ్రితః"

---

ఓం

# 22. సత్సహవాసము

## (సజ్జన మైత్రి)

"జంతునాం నరజన్మ దుర్లభం" అని పెద్దలు చెప్పియున్నారు. అన్ని జన్మములలో మనుష్య జన్మము శ్రేష్ఠమైనది. ఎందుకనగా మనుష్య జన్మమునకేగదా మంచి చెడ్డలు తెలుసుకొను జ్ఞానమును, ధర్మాధర్మ విచక్షణచేయు వివేకమును గలదు. ఇంతటి ఉత్కృష్టమైన జన్మము మరొకటిలేదు. ఈ జన్మమునకు జ్ఞానము ప్రధానము. "జ్ఞానేనహీన పశుభిస్సమాన" జ్ఞానమనే దొకటి లేకపోతే మానవుడుగూడ పశుసమానుడని పెద్దలు చెప్పియున్నారు. ఆ ప్రకారము మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము గూడ.

"నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహా విద్యతె" యని గీతలో భగవానుడు నుడివియున్నాడు. ఈ పవిత్ర జ్ఞానము పొందుటకు ప్రపంచమందుగల సాధనము లన్నిటిలో "సజ్జన సహవాసము" సర్వ శ్రేష్టదాయకమై యున్నది. ఇపుడు మనచే పూజింపబడి స్మరింపబడుచున్న మహాత్ములందరు సత్సహ

వాసము చేతనే శ్రేష్ఠత పొందినారు. ఇది మనయందరి దృష్టిలో నున్నదే. సజ్జనుల స్నేహము సకలార్థసాధనము ఎట్లనగా,

శ్లో॥ జాడ్యం ధియోహరతి సిఞ్చతి వాచిసత్యం
మనోన్నతిం దిశతి పాపమపాకరోతి
చేత ప్రసాదయతి, దిక్షుతనోతి కీర్తిం
సత్సంగతి కథయకిం నకరోతి పుంసామ్॥

భర్తృహరి. ౧-౧౯.

సజ్జనమైత్రి బుద్ధి మాంద్యము తొలిగించు చున్నది. సత్య సంభాషణ గలిగించు చున్నది. అజ్ఞానము తొలిగించి మనసుకు ఉన్నత స్థితి గలిగించు చున్నది. చెడునడతల త్రోసేయుచున్నది ధర్మకార్యములు చేయించుచున్నది. యశశ్చంద్రిక దిశాంతరము లకు వ్యాపింప జేయుచున్నది. చింతలు తొలిగించి సంతసము గలిగించుచున్నది. సజ్జన మైత్రివలన కలుగని దొక్కటి లేదు. ఇంతటి మహత్తుగల సజ్జన సహవాస మెంత విలువైనదో గమనించండి.

శ్లో॥ సాధునాం దర్శనం పుణ్యమ్
స్పర్శనం పాపనాశనం
సంభాషణం సర్వతీర్థాని
వందనం మోక్షసాధనమ్॥

సజ్జనుల దర్శనము పుణ్యము. వారిని తాకుట సర్వ పాపనాశనము. వారితో మాట్లాడగలిగితే సర్వతీర్థ యాత్రలు తిరిగినట్లు, అంతకుమించి వందనమే చేయగలిగితే మోక్ష దాయక మన్నారు పెద్దలు. అందుచే మానవులెల్లరు సజ్జన సహవాసమునకై పాటుబడి, వారిసేవజేసి తరించుటకంటె మించిన భాగ్యములేదు. అయితే సజ్జనులనగ యెట్టివారోయని తెలిసికొనుట చాల యవసరము. లేకుండిన బంగారమని నమ్మి గిల్టు నగలు కొని మోసపోయినట్లగును. వారిని కడుజాగ్రతతో తెలిసికొనవలెను. ఇపుడు సత్పురుషులమని జ్ఞానులమని బూటకపు మాటలు జెప్పుచు యమాయకులను మోసగించే దొంగ లనేకు లున్నారు జాగ్రత. చెట్లను చెడగొట్టు చీడ పురుగులవంటివారే యిపుడు గురువులమని జెప్పుక దిరుగుచున్నారు. మానవులను ఉన్నతికి రాకుండ చీడపురుగులవలె నీ పొట్టకూటి దొంగలగు గురువులు చెడగొట్టు చున్నారు. ఇపుడిట్టి గురువులు వూరూర దిరిగి శిష్యుల సంపాదించి వారి జీవితము గడుప జూచు చున్నారు. వారిని చూచి గృహస్థులు సత్పురుషులని, సాధువులని నమ్మి మోసపోవు చున్నారు. ఒకసారి ఈ మోసాకుల నంటు కొంటే జీవితము పాడయినట్లే. ఈ మూర్ఖులకు లోబడిన వారిని అజ్ఞానాంధ కారములో నుంచెదరు. కాని బయటికి రానీయరు. వారిని యే మంచి పుస్తకములు, తెలివితేటలు

నొసగి జాగ్రిత గలిగించు గ్రంథములు,.. వంచకుల కుటిల తంత్రముల తెలియ పరుచు పత్రికలు చదువనివ్వరు. తాము తమవంటి వంచకులు వ్రాసినట్టి జ్ఞానశూన్యమైన పత్రికాశికలు, ప్రబోధలు, సంపూర్ణ బోధలుమాత్రిమే చదువ చెప్పెదరు. వారు వ్రాసి ముద్రించుకొను గ్రంథములకు చాల పొడువు పొడవు పేర్లు పెట్టుకొందురు. ముఖ్యముగ వాటిలో మానవుడు తన జీవితమును సరిదిద్దుకొని కడతేరుటకు దగినది గడ్డి పోచంతయిన జ్ఞానముండదు. ఇట్టి గురువుల నడకలనుగూర్చి చెప్పబడిన పద్య మొకటి నిచ్చట వ్రాసెదను.

సీ॥ గురువుల మని జెప్పి గురుబోధ బోధించి
శిష్యకాంతల బట్టి చెలగు వారు
మా కనుభవంబాయె మానపుష్టంబనుచు
ఆనందమున నోలలాడెవారు
చక్కని యువతి పూజార్చకు మేలని
సరస సల్లాపముల్ జరుపువారు
ధనము సంపాదించ తగిన మార్గంబని
దినము శిష్యులవెంట దిరుగువారు

గీ॥ జిహ్వాకింపైన దాని భుజించి మరియు
కంటికింపైన కాంతల గలయ దోష
మెద్దియును పుణ్యనం పాపమనెడువారు
ఘనులు గురువులు గలిగిరీ కాలమందు.

పైన తెలిపినటువంటి మోసకుల పాలబడి జీవితము చెడగొట్టు కొనక జాగ్రత కలిగి వర్తించుకొనుచు జీవితము సార్థకము జేసికొని, సత్యసంశోధన గావించి, సజ్జనమైత్రి జేసి తరించి ధన్యులగుదురని నమ్ముచున్నాను. సజ్జను లెట్టివారో జాగ్రతగ గమనించి వారి సహవాస మొనరించి తరింప గోరుచు ముగించుచున్నాను.

బొంబాయి
20-7-48

ఇట్లు
వంగ గోవిందు

# 23. వందే మాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం సస్యశ్యామలాం మాతరం ॥వందె॥

శుభ్రజ్యోత్స్న పులకితయామినీం పుల్లకుసుమిత ద్రుమ దళ శోభినీం, సుహాసినీం సుమధుర భాషిణీం సుఖదాం వరదాం మాతరం ॥వందే॥

త్రింశంత్ కోటీ కంఠ కలకల నినాదకరాళే, ద్విత్రింశంత్ కోటీర్ధృత కరకరవాలే కే బోలేమాతుమి అబలే, బహుబల ధారిణీం నమామి తారిణీం రిపుదళ వారిణీం మాతరం॥

తుమివిద్యా తుమిధర్మ తుమిహృది తుమిమర్మత్వంహి ప్రాణా శరీరే, బాహు తేతుమిమాశక్తి హృదయే తుమిమా భక్తి తుమారేయి ప్రతిమాగడి మందిరే మందిరే ॥వందే॥

త్వంహిదుర్గా దళ ప్రహరణధారిణీ, కమలాకమల దళ విహారిణీ, వాణి విద్యాదాయినీ నమామిత్వాం, నమామి కమలాం అమలాం అతులాం సుజలాం సుఫలాం మాతరం ॥వందే॥
శ్యామలాం సరలాం సుస్మితాం భూషితాం ధరణీం భరణీం మాతరంవం ॥దే॥

## కీర్తన.

౧. దొరకదు దొరకదయా । మోక్షం । దొరకదు దొరకదు దొరకదయా॥ దొరకదు దొరకదు దొంగవేషములు - మరగి మహాత్ముల నునుకొని తమలా । విరివిగవేషము మురయుచు దాల్చియు । గురునెరుగక చెడితిరిగెడివారికి ॥దొరకదు॥

౨. అంచితముగ మంచీ । ఖాదీ - పంచెలుధరియించీ॥ పంచక్షౌరము బెంచుకమాయ జ । యించితిమని తర్కించితె యితరులు । అంచితముగ పూ - జించెదరని మది - నెంచియు సన్యాసించినవారికి ॥దొర॥

౩. చపలత్వము బూనీ । వ్యాఘ్రచర్మము గప్పుకొని॥ తపసులవలె రుద్రాక్షలు వేసుక । జపమాలికచే చక్కగ బూనుక । విపరీతములను విడువక గొణగుచు । నిపుణులమని వుపమెరుగని వారికి ॥దొర॥

౪. అడవులు దిరుగుచును । బాధలుపడిపడి మిడుకుచునూ॥ పొడవగు జడలు పొందుగ దాల్చుక । ఒడలుకు బూడిద వొప్పుగ బూసుక । ధృడముగ దేవుని పొడగన్నామని - నుడవుచు మీసం నులిమినవారికి ॥దొర॥

౫. పరిపరి విధములను - తెలియక పరుగు లెత్తినాను॥ కరుణతో చిన్మయ కవిసేలెడు సద్ । గురుదేశికులకు శరణని వెరువక । పరగున యమకింకరులకా దరిమే - వరవజ్రాయుధ మెరుగనివారికి ॥దొర॥

## కీర్తన.

౧. పుట్టదయ్యా తెలివి పుట్టదయ్యా - అజ్ఞాన నరులకు తెలివి పుట్టదయా తెలివి పుట్టాదయా॥ పుట్టదయ్యా పూర్వమున గురుపూజ చాలనేయకున్నను । వట్టిదె యిన్నాళ్ళుచదివిన గట్టిగా వినరయ్య మీరు ॥పుట్ట॥

౨. హద్దుదప్పి చరించవద్దని - మొద్దుకత్తిచే కోసికండలు। గ్రిద్దకు నెగవేసి కారపుముద్ద లంటించిననుగాని ॥పుట్ట॥

౩. సారెసారెకు బ్రమసి మోహ । సాగరములో మునగ వద్దని॥ ఆరెకమ్మరి కొలిమిలోపల।అణచికార్లను బట్టికాల్చిన ॥పు॥

౪. మంచిమాటలగోరి వీనుల । వంచి ఆనందించు మం చును । అంచితంబుగ కల్వమారున యుంచి మర్దించిననుగాని ॥పు॥

౫. దండిగ చిన్మయకవివరు అండజేరి నటించవేమని । బండపీపున నెత్తిచిత్తా । మెండలోకాల్ బొందజేసిన ॥పుట్ట॥

## కీర్తన.

(నరహరి భజన నోటనురా అనుమాదిరి)

౧, హరినామ స్మరణనేయండి । పుణ్యనరులార యిది మీరు మరచిపోకండి ॥హ॥ శ్రీవిష్ణునే మారకండీ । నిత్యసేవాలు జేయుచు చెలగుచుండండి । గోవింధయనుచు పలుకండీ । దేవ దేవుని విడనాడి తెర్లుగాకండీ ॥హరి॥

౨. వాసుదేవుని దలచండీ । హరిదాసులతోను వాదము లాడకండీ॥ వేసటజెంద బోకండీ । పాపరాసులు వృద్ధిగాజేసీ కొనకండి ॥హరి॥

౩. మేల్ యౌవనమూలో మీరు । నీతి - మాలి జ్ఞానము లేక మరచియున్నారు॥ నీలవర్ణుని గానలేరు । ఎల్లకాలా మేలా గై తె కడతేరలేరు ॥హరి॥

౪. కమలినాభుని నామజపము । కాల యమకింకరుల గొట్టుటకు వజ్రాయుదము॥ విమలవైకుంఠ సాధనము । కోటి శ్రీమలున్న మనసూకు సంతోషకరము ॥హరి॥

౫. పరులనిందలు నేయకండీ । పరులదారా ధనములనని పరులీడకండీ॥ వరభక్తవరులై యుండండీ । నరహరిని సింగరి దాసుదొర యనుకొండీ ॥హరి॥

## గణపతిపై మంగళారతి.

౧. ఆరతిదుగో గొనుమా - శ్రీవిఘ్నరాయా ॥ఆ॥ ఆరతి దుగో సుకుమారశరీర - నీరజమిత్రసుతా - శ్రీవిఘ్నరాయ ॥ఆ॥

౨. ఇద్దరితల్లుల ముద్దుల సుతనీ - శ్రద్ధతో పూజింతూ । శ్రీవిఘ్నరాయా ॥ఆ॥

౩. విద్యలవేల్పని విబుధులు బొగడనై । వేద్యము లర్పింతూ । శ్రీవిఘ్నరాయా ॥ఆర॥

౪. ఏకదంత ధొరపాక శాసనసుత । శ్రీకరకంఠసుతా । శ్రీవిఘ్నరాయా ॥ఆర॥

౫. ధరిపల్లీపురి ధన్య నృసింహానంద । వరకృష్ణ పరి పాలా । శ్రీవిష్ణురాయా ॥ఆరతి॥

## జగదాంబపై మంగళారతి.

(నీదయరాదేలా - మాతా) అనుమాదిరి.

౧. ఆరతీ గైకొనుమా । అంబా ॥ఆ॥ మారునిజననీ నారాయణి సర । సీరుహనేత్రి । చారుకళత్రీ । నేరములెన్న కుమా । అంబా ॥ఆర॥

౨. అగరుగంధములచే । అంబా । తగుపరిమళములచే । అంబా॥ నగుమొగమున కస్తురితిలకము నిడి । తగదీపంబులు తాండవమాడగ । జగతిలొ పూజింతు । అంబా ॥ఆర॥

౩. పంచామృతములచే । జననీ । పాయసాన్నములచే । జననీ॥ పంచదారసిర । పక్వాన్నములు వి । రించికెంచరాని నివే దన ల । ర్పించితి గైకొనుమా । జననీ ॥ఆర॥

౪. ధరిపల్లినివాసీ । జననీ । హరిప్రియ మృదుభాషీ । జననీ॥ స్థిరతరవైభవ కరములొసంగియు - దరిజేర్చుమటనె దాసుడు లక్ష్మణ - మొరలాలించగదే । జననీ ॥ఆరతి॥

## జగన్నాథస్వామిపై మంగళారతి.

౧. దాతాగైకొనుమా । ఆరతి జగన్ - నాథా గైకొ నుమా ॥అరతి॥ దాతసుజనసునేతవర ప్రఖ్యాతవందిత పాతకాహర। సీతరమణ విధాతజనకా ప్రీతితోడుత నాతోమంగళ ॥దాతా॥

౨. మల్లెపుష్పములు । మొదలుసుగంధా - మెల్ల ద్రవ్యములూ ॥మొ॥ మెల్లెమెల్లెనగూర్చి భక్తి ప్ర - ఫుల్లమానసమల్ల జెదరక।జెల్లజేతును నల్లనయ మా।తల్లిలక్ష్మితో యిల్లుజేరుమి ॥దా॥

౩. క్షీరాన్నములునూ । మంచిపంచ-దారా తేనెలునూ॥మం॥ కోరిషడ్రస పూరితములగు భూరిపక్వాన్నమూలు మీగడ । లారాధన జేతుకోర్కెతొ మారజనక మంగళాకర ॥దాతా॥

౪. పక్షీంద్రావినుతా । బొంతలపౌరి లక్ష్మీసంచరితా ॥బొం॥ మోక్షదాయక లక్ష్మణాఖ్యుని కుక్షిలో నివసించికోరిన । వక్షయంబుగ నిచ్చుటకు బహుదీక్షబూనితి నీక్షితివో ॥దాతా॥

## ౩౬. వీరాంజనేయ మంగళారతి.

౧. ఆరాతినీకు మారుతిరాయా । వీరాంజనేయా ॥ఆరా॥ పారసముగ కర్పూరాగరులచె - కోరిపరిమళము లూరనీకు మంగ ॥ళారతి॥

౨. పసుపు కుంకుమలు నీపైజల్లీ । విరజాజితామర - కుసుమంబులెల్ల మాళాలల్లీ ॥విర॥ దశరథనందన దాసనీమెడలో - రసికతొవేయుదు రామదూతవని ॥ఆరాతి॥

౩. నారికేళా దిక్షీరాల్దెచ్చి । శర్కరసహితముగ - భూరీ తరమగు నివేదనలిచ్చీ ॥శర్క॥ మారుతినిను ముమ్మారునుతించిన వారికి వరములు వసుధనొసగుశుభ ॥ఆరాతి॥

౪. శ్రీనిర్మల పురమునందు నిలచీ । దాసులందరిని - దరిజేర్చి దాతవని నినుదలచీ ॥దాసు॥ పనిబూనియు నినుప్రార్థించెడి లక్ష్మణదాసునియెడ నెనరుంచుమిజయ ॥ఆరా॥

## ౩౭ వెంకటేశ్వర మంగళారతి.

(హేగోపాల బాల మురళీధర) అనుమాదిరి.

౧. శ్రీవేంకాటరమణ నీరాంజనం । నీరాంజనం - నీరాంజనం ॥శ్రీ॥ సుందరవిగ్రహ - మందరగిరిధర । నందతనయ ముకుందమురారి ॥వేంకాట॥

౨. భృగుపదఘట్టన పదసేవన । తగనొనర్చి నేత్రమ్ము నలచిన ॥వేంకాట॥

౩. సిరిమిముజేరీ । మొదలిడశౌరి । కరుణించక సిలాకారుడవైతివి ॥వేకాంట॥

౪. తిరుపతివాసా । ధరిపల్లీశా । వరలక్ష్మణకవి పరిపాలనశ్రీ ॥వేంకాట॥